# యామావిక

గ్రంథకర్త

తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి




శ్రీరామకథామృత గ్రంథమాల, చందవోలు.

# వాసుదేవసారథ్యము

ఉ. ఊర్జితమా రథమ్ము, విశదోజ్జ్వల వాహసమేత మగ్నితో
నార్జితమైన, కేతనమునం దనిలాత్మజు డొందియున్న నా
వర్జితమైన గాండివము పాణియుగమ్మున నాడుచున్న దా
నర్జునుఁడై న జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౧

ఉ. ఉద్ధతులైన శాత్రవుల నోర్వఁగ నెమ్మది నూపుకల్గినన్
శ్రద్ధ యజింపఁబడ్డ గురుసంఘము ప్రీతికిఁ బాత్రమైన సం
బద్ధము దేవదత్తము రవంబఖిలాశలు ద్రెవ్వఁ దాను సం
నద్ధుఁడునై నఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౨

ఉ. పరమ తపః ప్రసక్తి వృషభధ్వజు మాయపురూపు గెల్చి యా
పరమునిఁ గొల్చి ధన్యుఁడయి పాశుపతంబను పేర సర్వసం
హారణము సేయు నాయుధము హస్తగతం బొనరించుకొన్న య
న్నరుఁ డగునేని జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౩

ఉ. అక్షయ బాణతూణముల నంసములం బిగియించి మించి ప్రా
గ్దక్షిణ పశ్చిమాశలకుఁ దమ్ములఁ బంచి రహించి యుత్తరాం
తక్షితి నాక్రమించిన ధనంజయుఁ డుద్ధతిఁ బోరఁ గోరి తే
రాక్షణ మెక్కఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౪

ఉ. ఆస సమస్త తీర్థముల నాడుచు వచ్చి తదర్థమర్థ స
న్న్యాసియునై సుభద్రఁ దదనంతర జన్ వలపించి భక్తి న
భ్యాస వశమ్మున న్నిజవశాత్మ నొనర్చి సబంధ బాంధవ
వ్యాసనుఁడై నఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౫

ఉ. ఉత్తర సారథింబడసి యున్నతుఁడై రిపులోకగొన్న గో
సత్తమ వర్గమున్మలఁచి సాంఖ్య విచార విదూరులౌచు నా

పత్త్రికిన్నైన కర్ణముఖవైరులఁ ద్రోలిన వీరుఁడట్టి యా
యత్తుఁడున్నైనఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౬

ఉ. రక్కసులన్వధించి మది రంజితముం బొనరించె నీతఁ డ
మ్మక్కయటంచు నోజము బిడౌజుఁడు మెచ్చి కిరీటమీయ నై
వెక్కసమైన తేజమున విశ్వము ముంచు జగజ్జయార్థి యా
యక్కఱకైనఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౭

ఉ. అర్థ నిమేష మాత్రమున నయ్యఖిలారిచమూ సమూహముల్
స్వర్ధరణీ రసాతల నివాసులు తోడ్తోన గూడిరేని నీ
యర్థమునన్ హరింతునని యాద్యము ధర్మమునూరడించువాఁ
డర్థి రహింపఁ జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౮

చ. సకల మధీశ్వరుండొకఁడు సాక నెసంగుచు నుండె నట్టి నా
యకునకు నాకు భేద మరయం గనుపట్టదు మేనమామ పు
త్రకుఁడటె వాఁడు నేనెవఁడ దత్త్వదృశంగనుగొన్ననంచుఁదా
న కలుషుఁడైన జీరవలెనా? నొగ లెక్కఁగ వాసుదేవునిన్. ౯

నవమాలికసమాప్తము.

# విషయ సూచిక

ప్రథమ ప్రకరణము


యామావిక—సందర్భము పుట 1
ఒక యోగి—సంచారము 4
ఒక కన్య 4
భోగినీ యోగి సంవాదము 7


ద్వితీయ ప్రకరణము


ఒక యోగి—తీర్థ యాత్ర 22


తృతీయ ప్రకరణము


వసంతోత్సవము 34
పుష్పాపచయము 39
మదనార్చనము 42
రస శాబల్యము 45


చతుర్థ ప్రకరణము


హరికథోపక్రమము 49
శ్రీకృష్ణావతార ఘట్టము 53
కంసుఁడు కృష్ణసోదరిఁ జంప నెంచుట 61
శ్రీకృష్ణుని విహారము 62
రాధ తపము 62
శ్రీకృష్ణుఁడు రాధ ననుగ్రహించుట 66
శ్రీకృష్ణుఁడు పుండరీక వరదుం డగుట 67
పౌండరీకాశ్రమము 70
నృసింహ తీర్థము 71
త్రిపురాసుర సంహారము 72
చంద్రభాగా ప్రాదుర్భావము 72

పంచమ ప్రకరణము


అష్టావధానము పుట 82
ఆకాశ పురాణము 84
మను చరిత్రము 86


షష్ఠ ప్రకరణము


రాజప్రతినిధి యాస్థానమున నొక్కని కార్య నివేదనము 92
న్యాయవాది నేర మొనర్చినవానిఁ బ్రశ్నించుట 95
ఒక కథ 96
బాలఘ్నుఁడా బాలు బ్రదికించుట 106
అధికారి తీర్పు 108


సప్తమ ప్రకరణము


యోగి వియోగ ప్రలాపము 113
యోగి బాలయోగుల సంవాదము 115
యోగి నిర్వేదము 120
యోగ గీతావళి 124


అష్టమ ప్రకరణము


ఒక కాంత 131
మఱి యొక సతి 134
ధ్యాన శ్రుతి 135
ఇంకొక సంరంభ వచ శ్శ్రుతి 142
స్వామి సాక్షాత్కారము 143

శ్రీ శివాయ గురవే నమః

# యా మా వి క

## ప్రథమ ప్రకరణము

### యామావిక - సందర్భము

శా. శ్రీవిద్యామహనీయయోగమున నిర్ణిక్తాంతరం బైన చే
తోఽవస్థానమునన్ నిరంతరము సోహంహంసభావంబుతో
భావింపంబడు నమ్మహేశ్వరపరబ్రహ్మమ్ము మమ్మేలు స
త్త్వావష్టంభసుఖానుభూతి భవభావాభావభానమ్ములన్. ౧

ఉ. వందన మందుకొమ్ము జనవత్సల! స్వాస్థితచందవోల్పురీ
మందిరమందిరా! వినెదె? మా మనవిం దటియే? యమ్మైన రా
జ్యేందిరతో మదాదిజనయిత్రి యవామగ వామతో మహా
నందముతో మముం గని మనం బిడు మీ దెసఁ జెన్న కేశవా! ౨

చ. కృతి నయి మీకృతంబున స్వకీర్తికరిం గృతి నీఁ దలంచితిన్
గతిఁ గొనుమయ్య! దీన మదఘంబు లెడల్పఁగదయ్య! యాతతా
దృతుల వహింపఁబోక పొలితిం బొలఁతిం గయికోఁగదయ్య! యా
నతు లొనరింతు నన్యములు నాతరమా? హరి! చెన్న కేశవా! ౩

చ. మును పొకసారి కుంచవరముం బురముం బని గల్గి చేరఁ బో
యిన నది మాఖమందు భవదీప్సిత మా తిథి యాటఁ గృష్ణలో
మునుగఁగఁబోవు మాన్యజనపుంజము నన్నును జీర వారితో
ననుగతి వల్లభాపురము నధ్వమునం బడి పోవుచున్నెడన్. ౪

క. శ్రీమహితుఁడు వేదాంతము
రామస్వామి యను ఘనుఁడు ప్రథితుఁడు కొల్లా

ర్గాత్రిమాగతుఁ డవధాని మ
హామహుఁ డల భాగవతుల యన్వయజుండుఁ.

గీ. సూర్యనారాయణాఖ్యుండు శుద్ధచరితుఁ
డేను బుట్టి పూర్వోత్తరంబుల నెఱుఁగఁగాని
వాసుదేవాభిధుఁడు బుధవర్యుఁ డొండు
గాఁగ నలువుర మేము నీ కథలఁ దనిలి.

గీ. అర్థి నొక శ్లోకొళుల కేమొ యనుచు వినుచుఁ
గాల మధ్వ మ్మటు గ్రమింప ఘనుఁడు నుడివె
వాసుదేవ శాస్త్రీంద్రుండు భవ్యగాథఁ
దెలుఁగుసేసి మహారాష్ట్ర దేశభాష.

గీ. దానికి సగర్భ మై ప్రతిభాన మెనసి
నా ప్రతిభ తన్వి గనియె సంతతిఁ గృతి నిటు
లగుటఁ దత్స్మృతి వివరింతు నవధరింపు
మఖిలజగదీశ! యస్మత్పురాధివేశ!

సీ. "మధురావిజయకృతి" మాలిమి నొసఁగితి
గురుఁ డైన నాగలింగునకుఁ గవికి
హనుమ కిచ్చితిని సీతమ్మ కోర్కికి "సత్య
నారాయణమహత్త్వ" నామ గాథ
"కల్యాణకైవర్తకము" సతీర్థ్యుం డని
పిశుపాటికులున కర్పించితి రతి
"రామకథాఽమృతార్థము" పితృపాదుల
తోఁ బరతత్త్వమందు నిడఁగంటి
"దత్తభాగవత" మను గ్రంథంబు నిన్న
మొన్న లింగోద్భవస్వామి కెన్నఁ గూర్చి
నేఁడు నీ కిడుచుంటి ననింద్య దీని
వాడ నున్నావు నీవు నా వాఁడ వనుచు.

గీ. అర్థకాముఁడఁ గాను నీ కప్పగించు
చుంటిఁ గైకొనుమయ్య యీ యుత్తమఁ గృతి
నోలి నా కేల నీ మోలి? మోలలితుఁడ!
వీఁడు నావాఁ డనుము చాలు వెర వెనయుదు. ౧౦

ఉ. చంచల కాదు కా దచల సన్నుతనేనియు నీల కాదు స్వ
భ్యంచిత కావ్యకన్య యిది యన్నివిధంబుల నిన్ను గొల్చి మె
ప్పించు ననుం గృతార్థుఁ డనిపించు వహించు యశోభరంబు నీ
మంచికి దీనిఁ గొంచుఁ గనుమా సుఖసంతతిఁ జెన్నకేశవా! ౧౧

ఉ. వందలు వేలునుం గలరు వల్లభ లంచు నెఱింగియుండి య
స్పందమతిం గృతిప్రమద సద్గుణ నీతఁ డొసంగినాఁ డటం
చెందును దక్షిణత్వ మది యేర్పడ నేలినఁ జాలుఁ జాలుదున్
ముందర పే ర్గడించిన సుపుణ్యుల మించఁగఁ జెన్నకేశవా! ౧౨

క. శ్రీమాన్యమజ్జనకపా
దామోదితమిత్రకృష్ణమాచార్యపద
ప్రామాణికార్చ్య! యోగ
క్షేమావహనామ! చెన్నకేశవదేవా! ౧౩

వ. అవధరింపు మస్మత్త్రియికి వాసుదేవశాస్త్రి యిట్లనియె. ౧౪

గీ. నాభిసరసీజమున నొక నందనుఁ గని
యతనిపనికిని సాహాయ్య మాచరింప
సరసు లరసులు ననక హృత్సరసిజములఁ
గాముని సృజించిపెట్టు చిద్ధనుఁ దలంతు. ౧౫

శా. శ్రీరాఢంబు శరీరిపాపభరదారిద్ర్యానుసంధాయకం
బారామవ్రతతీవితానరమణీయానోకహానీక మా
ర్యారబ్ధాధ్వరభూనిఖాతశతయూపామేయభాగ్యమ్ము కా
వేరీతీరము భాసిలున్ సకలపృథ్వీభాగసౌభాగ్య మై. ౧

శా. ఆ కావేరి తటాంచలమ్మున సహస్రాంశుండు పద్మిన్యయ
ప్రాకట్యంబు వహించు వేల నడిచెన్ బాభాసమానుండు యో
గ్యాకారుం డల భోగిభోగశయు ముఖ్యు మైత్రన చుట్టమ్ము నా
నాకుల్ తీవలు గోచియున్ రశన లై యంగాళి రంజింపఁగన్. ౧౭

ఒక యోగి - సంచారము

క. ఏపగిదినో? యెపు డెందో?
నీ పద మొకసారి తలఁచి నిన్నధమర్ణుం
గాపురుషుఁ డైనఁ జేయున్
శ్రీపతి ! మోక్ష మ్మతనికి సిద్ధింపదొకో ? ౧౮

మ. చలదూర్మిప్రచయం బగాధమగు సంసారప్రవాహంబునం
గల యావర్తము లైన జన్మతతులన్ గాసిల్లు కీటంబు నీ
విలసత్కారుణికత్వ మూత గొని సద్వృత్తిం దరిం జేరుఁ గా
ని లవంబేని స్వతంత్రతం బెరయ దున్నిద్రాత్మ! విట్ఠలప్రభూ! ౧౯

మ. అఖిలంబు న్భవదీయవై భవ మనన్యంబుల్ నభోధారుణీ
ముఖభూతంబులు భౌతికంబు లని సంబోధించు వేదాన్తముల్
సుఖదుఃఖంబులు బంధమోక్షములు నీశుం డైన నీ కున్నవే?
నిఖిలంబుం దన బుద్ధిచేఁ గుడుచుఁగానీ ప్రాణి విట్ఠలప్రభూ! ౨౦

క. బహుతృణ మవు సంసారం
బహిశయన! యశాశ్వత మని యాత్మ నెఱిఁగియున్
బహులరజఃకలనంబున
బహుశ్రుతులె దారి తప్పు వార లధీశా! ౨౧

ఒక కన్య

మ. అని భక్త్యున్నతి మై గగుర్ప మహితధ్యానోల్లసత్పారవ
శ్యనిరూఢిన్ సకలోర్వరన్ మఱచి నిత్యానందుఁ డై వోవు నా
మునిముఖ్యుం డెదురం గనుంగొనె నొగిం బూఁబోఁడి నొక్కర్తు న
వ్వనితారత్నముచాకచక్యము నుతింపన్ రాదు శేషాహికిన్. ౨౨

సీ. లేడిచూపుల లీల లేఁజూపులను జేయు
చొప్పున నొప్పెడు చూపుకోపు
మాలూరఫల మెన్న మాఫల మే యను
మాద్రి నెసఁగు కుచమండలమ్ము
సరసీజమా? యిది సరజ మే పొమ్మను
చంద మొందిన మోముచందమామ
చిగురుచెల్వం బనఁ జిఱుచెల్వ మని యొత్తి
నట్టు బిట్టులరెడు నంఘ్రియుగళి
యంగభంగి గాఁగ నక్షరత్వంబు
నెఱుఁగువారి భంగపఱుచు నెంత?
యన్నియెడల నున్న యక్షరమ్మునె మాటు
చేయఁ బూను చాన చేతి కింక. ౨౩

ఆ. అచటి కొమ్మలందు నాకొమ్మ నొకకొమ్మఁ
గాఁ దలంచి యోగి కడచి నడచె
లోష్ఠకాంచనములలో భేద మెఱుఁగని
విరతు మతికి నిదియు వింత యానె? ౨౪

ఉ. ఉల్లము గొల్లవోవ నల యుగ్మలి తిగ్మరుచిప్రకాశుఁ డౌ
నల్ల మునీంద్రుఁ గాంచి తన యంగము లంగజుచేతఁ దూల మే
నెల్లఁ జెమర్ప నోర్పు సెడ నెంచె మనంబున వీనిపాదసం
పల్లవ మేని లేని యగపల్లవమా? యసి శంబరారికిన్. ౨౫

మ. కమలాకాముకు కామనీయకము రాకాయామినీనాయకో
త్తము సాకల్యము మారు చారుతరతాత్పర్య మర్ధాంగజా
ని మహత్త్వం బజునోజముం బెనుచు మానిప్రఖ్యుసేవారతిం
గమనీయం బగుఁగాత మామకము భాగ్యం బెందు యోగ్యం బనన్.

క. ఏవిధమున నేనియు నే
నీ వశివరు నాత్మవశసుఖేచ్ఛ నొనర్తున్

భావము ప్రాసిన కృతుల క
భావం బనఁ గల్గునే శుభం బగు ననుచున్. ౨౭

చ. తలఁచి చలించి లేచి కలితం బగు చూపు పరిభ్రమింప ని
శ్చలు నతని న్విలాసశతసంస్తుతపాశనిబద్ధుఁ జేయ నెం
చి లలన గూర్చు చెయ్వులు వచింపఁగ వచ్చునె? మెచ్చవచ్చుఁ బో
వలచిన వారికిం దగు నుపాయములం గలవే? యుపాయముల్. ౨౮

మ. తన వాల్జూపుల చొక్కు మందునకుఁ జెందన్ రాక లీలాలతా
వనిపాతంబున కోటువోక నిజనిర్వేశం బపేక్షింపకే
చను యోగి న్వలఁ జేర్పవచ్చు వల నిచ్చం బెచ్చు యోజించుచున్
వనితారత్నము నూత్నహారలతికావక్షోజవిక్షోభ యై. ౨౯

ఉ. కట్టిన పట్టుపుట్టము వికాసము భాసుర మై రహింప నా
దట్టపు మేని కాంతి పయిఁ దారటలాడెడు గబ్బిగుబ్బ లం
దొట్టిన ఛాయ హారరుచియుం గనుఁబ్రామఁగ మానినాథు నా
కట్టి యెదిర్చి దోయిలి చొకారము మీఱ నమర్చి యా స్థితిన్. 30

క. సుమనఃప్రియభానా! నుత
దమ! శాంతిసుఖప్రకామదా! యోగకలా
కమనీయక! పావనసం
గమ! కూర్తు ననాథనాథ! కై మోడ్పులన్. 3౧

క. అని యక్కొమ సాగిలి మ్రొ
క్కినఁ గనుఁగొని మానివరుఁ డోగి న్నాదరుఁ డై
యనితరసాధారణపతి
జనవాల్లభ్యం బెనయుము చానా! యనియెన్. 3౨

గీ. పుడమిరజము పయోధరభూమి నెఱయ
లేచి నిలిచి ప్రకాశించె లేమ యపుడు
మానివర్యునిపైఁ గొన్న మమతకతన
నల్ల నల్లనఁ దాద్రూప్య మమరినట్లు. 33

## భోగినీ యోగి సంవాదము

ఉ. పన్నిన ప్రేమబంధమునఁ బైఁబడి తేనిఁ దలంకఁ డట్టె యీ
సన్నలకున్ విలాసముల చాయకు లోఁబడు వాఁడె? వీఁడు సం
పన్నతపఃప్రభావుఁ డతివా! మన కిచ్చట సిగ్గు లగ్గె? ముం
దున్నది పో రసం బనుచు నూరక మారుఁడు వోర నారియున్.

ఉ. యోగివతంస! నా జని యథోచిత మయ్యె భవద్దయాప్తి నిం
కే గతిఁ బ్రోచెదో? తలఁప నెన్నఁడుఁ దుచ్ఛసుఖమ్ము లేను నీ
యోగి యనర్థమైన నిల యెల్ల వడంకదె? నన్ను భోగినిన్
యోగినిఁ జేసి యెట్లు మహిమోజ్జ్వల! యేల ననుగ్రహింపవే. ౩౫

మ. అని లో నున్నది విప్పిచెప్ప నతఁ డయ్యబ్జాక్షి నీక్షించి యి
ట్లను లేమా! భవదీయమానస మదెట్లట్లింకఁ గాఁ జాల దే
మనినన్ లోకముగోడు మాని వనమధ్యంబందు జంతువ్రజం
బును బోలంగఁ జరించు మాకు నకటా భోగంబు లింపౌనొకో? ౩౬

శా. నీకుం బోలిన వానిఁ గాఁగ నెవనిన్ నిర్మించె నా ధాత సు
శ్రీకున్ వాని వరించి జవ్వనము వాసిం జెంద సౌఖ్యంబులన్
గైకోనెంచుము నన్నుఁ బోటి వికలుం గామాదిదూరుం జటా
నీకశ్మశ్రుభయంకరున్ వలచి తేనిన్ నవ్వరే? కామినీ! ౩౭

ఉ. తా నట యోగివర్యుఁ డట తన్వి నొకర్తుకఁ దెచ్చెనంట యీ
మౌనికి భిక్షసేయవలె మానిని కేమి యొనర్పఁగా వలెం
బూని వచింపుఁ డంచుఁ బొరపొచ్చెములాడు జనంబులందు నీ
కేనియు నాకునేనిఁ దల యెత్తఁగవచ్చు నెటుల్? తలోదరీ! ౩౮

క. అని నవ్వు వుట్ట ననుచుం
జన నెంచెడు మౌనితిలకు చందముఁ గని యా
వనితామణి తన నెమ్మన
మునఁ దలఁచె నిదంవిధముగ మురిపెము లఱుమన్. ౩౯

మ. వనితామండలి కప్రతిష్ఠ ప్రవరున్ వాంఛించి తెచ్చె న్వరూ
థిని నే రెండవుదాన నౌదునొకొ? యీ ధీసాంద్రునిం గోరి నా
కును నద్దానికి సామ్యమే? తుద జలాగ్నుల్ లేవె? య శ్లైల? నా
యను వెల్లం దిలకించి వశ్యుఁ డవు నం చావెంటఁ దా ని ట్లనెన్. ౪౦

ఉ. లోకముగోడు మాని పరలోకము నెంచి తపించు టెల్ల నా
నాకవధూసుఖాప్తికి మనం బురియాడుచు నుంటఁ గాదె నా
థా! కరుణించి న న్ననిపి దైవతభామల నాదరించుచో
నీ కెఱుఁగంగరా వొకొ? మనీషితసిద్ధివిశేషసంపదల్. ౪౧

ఉ. అన్నియు నాత్మకుం దెలిసి యక్కట మాటల మోసపుచ్చఁగాఁ
జన్నె? నిను న్విధాత్రుఁడు నిజమ్ముగ నా కయి సృష్టిసేసె నే
మన్న నీఁ కేమి? లోకమునఁ కై విధివ్రాతఁ దలంగవచ్చునే?
పున్నెము గట్టుకొమ్ము ననుఁబోటినిఁ గాచి మునీంద్రచంద్రమా!

మ. తనకుం దా నయి కోరి వచ్చిన లతాతన్వి న్విసర్జించె ని
మ్మని యేరా! రస మిట్టు లుండునె? మహామోహాప్తి నాలేమయుం
దనకై ప్రాణము వాసెఁ గాల్పనె? తపోదాంత్యాదు లం చాడు నీ
జనవాదంబు సహింతు నెట్లు దివి కేఁ జన్న న్మునీంద్రోత్తమా! ౪౩

సీ. గలమున బంగారు గొలు సిచ్చెదనుగాని
మొలత్రాఁ డొనర్పు మో మునివరేణ్య!
పైటచెం గొకకొంత పంచి యిచ్చెదఁ గాని
పిడిచుట్టు చుట్టు మో విమలహృదయ!
యుత్తరీయం బొకఁ డుండె నిచ్చెదఁ గాని
బుజముపై నుంచు మో విజితమదన!
లలి కెంపు ముక్కుపోఁ గుల నిచ్చెదను గాని
శ్రుతుల భూషింపు మో నుతచరిత్ర!
చేత జెడ లెల్లఁ జిక్కు తీసెదను గాని
నను నియోగింపు మింక నో యనఘమూర్తి!

చేరి నిరతంబు సేవ సేసెదను గాని
మదనసామ్రాజ్య మేలు మో మానసీయ! ౪౪

మ. తపసీ! దాపఁగ నేల నా మనము మద్రత్నాంబులేనిఁ భవ
త్కృపకుం బాత్రము లేమి సేసెదవొ? నారీహింస పాపంబు పూ
ర్వపు మౌనీంద్రు లిదే తలంచికద ద్యోవారాంగనాసంగమం
బుపలాలించిరి నీ వెఱుంగవె? పురాణోక్తిప్రపంచమ్ములన్. ౪౫

క. శ్రీలలిత! బ్రదుకుదును నీ
యాలింగన మొనసి దివికి నరిగెద లేదే
నేలాగు నీట ముంచెదొ?
పాల న్ముంచెదవొ? నీదుపాలం బడితిన్. ౪౬

క. అనుచున్ డగ్గుత్తికఁ జెం
దిన కంఠము బాష్పలవము నెనసిన కనులుం
గనఁ గ్రొత్త యైన వైఖరి
యును గల రుచిరాంగిఁ జూచి యోగి యచలుఁ డై. ౪౭

క. వెడనవ్వు నవ్వి యిట్లనుఁ
బడఁతీ! నీ నేర్పు మెచ్చవచ్చును నీ కె
వ్వాఁడు దగు నటఁ జూపిన నా
కడ నింకిట నిట్లు పలుకఁగాఁ గాదు చుమీ. ౪౮

క. వలవనివాని న్వలచుట
వలపు తెఱంగే? మొఱుంగువాల్గంటీ! నీ
పలుకులు చిత్రతరమ్ములు
కలికి! రసాభాస మిది జగమ్మున కింపే? ౪౯

మ. క్షణభోగ్య మ్మవు తుచ్ఛసౌఖ్యమునకా శాంతిప్రదం బౌ ప్రతి
క్షణకష్టాత్తతపఃప్రబంధమున కాశ్వాసాంతముం గూర్చి వా
రణయానా! ననుఁబోటి లోఁబడుట? నీ ప్రౌఢత్వ మే మందు? నీ
ఘనుతం ల్సాలును జాలుఁ బొమ్ము కలదే?భావం బభావంబునన్. ౫౦

మ. వనితా! కీకసమాంసచర్మమయ మీ వర్ష్మంబు పై పూతలే
ననలుఁ సొమ్ములు నంబరంబులును సౌందర్యార్థ మేదో కదే?
ననుఁ గన్నాబముఁ దలంచుచుంటి వటు లౌనా? చాన! తత్త్వార్థయు
క్తినిఁ గా కన్యుల కే మధీనులమె? పొల్తీ! వెల్తి మై తక్కటా! ౫౧

క. విను మీ వబల వటం చిటు
లనుమానించెదను గాని యలివేణీ! నా
దునియమము సెఱచు నెవఁ డా
తనిఁ గాల్పనె శాప మొసఁగి తద్వంశముతోఁ? ౫౨

క. అని పోవుచున్న యమ్మునిఁ
గనుఁగొనుచుం బకపక నగి కలికి వలుకు నో
మునినాథ! చిత్తగింపం
జను నవధానమున మనవి శమ మమరారఁ. ౫౩

గీ. క్రోధ మనఁ గామ మనఁగ వైరు లివి రెండు
తపమునకు హీన మందుఁ గ్రోధంబు సుఖము
కలుగదు వ్రతంబు చెడుఁ గానఁ గామ మన్న
వ్రతము సెడినను సుఖ మఖర్వము నమర్చు. ౫౪

ఆ. కామ మెందుఁ గలదు కాకున్న మోక్షంబు
మాత్ర మెనయు వశమె? మానితతికిఁ
గామిగాని మోక్షగామి కాఁ డనెడు నా
ర్యోక్తి వినమె? క్రోధ ముఱదు కాని. ౫౫

క. ఆభాస మా జగతికి ర
సాభాసం బింపు గామి యాభాసమ కా
దే? భాసమాన! వలవక
పో భాసిల్లెదవె? సర్వము న్మనవశమే? ౫౬

గీ. కొంత సౌఖ్యంబు దక్కించుకొనఁగలేని
యతని కెమ్మెయిఁ జొప్పడు నంత సుఖము

తపము సెడఁ దిట్టు మనెడు క్రోధమున కేని
నకట లోఁబడు టెట్టు నీ యట్టివాఁడు? ౫౭

క. ఈయఖిల మభావమ పో
కాయము కమనీయతయు సుఖంబు నిజములే?
ధ్యేయపర! గజము మిథ్య ప
లాయనము న్మిథ్య యనెడు లా గపథంబే? ౫౮

మ. ఇనతేజా! విను మాగమోక్త మగు ముంజేషీకదృష్టాంతసం
స్థ ననుం గాయముఖాతిరిక్త మగు నస్మత్ప్రత్యయార్థమ్ముఁగాఁ
గొని యైక్యాప్తి సుఖింపలే వయితి నీకుం బ్రాఁతె యుత్కృష్ట మ
య్యినబింబాంతరవర్తిసర్వగమహాత్మైకత్వబోధం బహో! ౫౯

క. ధీయుత! శ్రుతియ కదే తల
పోయ "రసో వై సః" యనుచుఁ బొగడె "రసగ్ంహ్యే
వాయం లబ్ధ్వానందీ"
త్యాయతవాగ్యుక్తి రసమహత్త్వం బసదే? ౬౦

గీ. అనుచు నా యూయి పలుకులు ననుచు కూర్మి
ననుచు వెంబడిఁబడి వచ్చు నన్ను మిన్న
ప్రౌఢి మెచ్చియుఁ దవులని భావ మొప్ప
నతఁ డరుగుచుండె రుషయు హేయ యని కొనుచు. ౬౧

క. ఎడనెడ నెమ్మది నే మని
పొడమెడు నాలోచనములఁ బూఁబోఁడి యొడం
బడక యడఁగించి కైకొనె
నొడికం బవు నొపయికము నొకఁ డి ట్లనియెన్. ౬౨

సీ. కామాంధ ననుకొంటి కాఁబోలు నిజముగా
మునినాథ! యిట్లు కామిని నొడువునె?
సత్కులాచారప్రశస్తి గాంచినదాన
దైవవశంబున దారి దప్పి

కాంతారగత నైతి గాదిలిచెలులతో
నెడబాటు గలిగె నిం కేమనఁ గల ?
దీపరిసరమునసే నాపురం బుండె
నెఱుఁగఁ బథంబు నే నేమి సేతు?
ననఘ! యొంటిగఁ బోలేక నినుఁ గోని చన
నెంచి నీ పాడి యెట్టిదో? యెఱుఁగ నంటేఁ
గంటి లే దని కొంటి న న్గావుమయ్య!
నన్ను నావారిలోఁ జేర్చు మెన్నుమయ్య!

క. దయ గలవాఁడవు యోగివి
నయ మెఱుఁగుదు దిక్కులేని నవలా నన్నుఁ గా
భయ మెడలించి పురిఁ జేర్చుట
యయమో? యన్యమ్మో? యరయుమా సుకృతాత్మా!

గీ. నాకు నిడ నేమి కలదు? సన్నితియ దక్క
భూతదయ మీకు వలయునో? పున్నెము గోను
మనుచు నార్తి వచించు న య్యతివ నమ్మి
యూరు సేర్చెదు పని కాతఁ డొప్పుకొనియె.

క. తనయురిలోఁ దవిలిన వా
నినిఁ గా నవ్వానిఁ దలఁచి నెలఁతుక విశ్వ
స్తు నొనర్పఁ గొంతదూరము
చనిచని యా యా పలుకులఁ జన వేర్పడఁగన్.

సీ. ములు గ్రుచ్చుకొనెఁ బాదమున నని యిలఁ బడి
తీయించుకొనియె నిర్మాయుచేతఁ
దేలు కుట్టిన దని నేలఁ గూలుచు నేడ్చి
తదుపచారాప్తి ని స్తంద్ర యయ్యె
నిక్కడ నెది యో చుఱుక్కనె నని వెక్కి
తద్విషవైద్యసందర్భ మొనసె

నల్లన దయ్యాల యనుభవంబులు సెప్పి
యతఁ డిచ్చు బసుమ మంగాళి నలదె
నెడనెడఁ బరశ్శతమ్ముల నిట్టివ యవు
కైతవమ్ముల నమ్మానిఁ గలఁచియాడె
నొక్క విభ్రమము వహించి టక్కులాడి
యతని యవ్యాజసౌహృదయ్యము నెఱింగి. ౧౮

శా. చెమ్మట గ్రమ్మె మేనున వశిప్రవరా! ననుఁ జూడు మొక్కమా
రమ్మెయి దూరము న్నడుచు నమ్మెయి కంఘ్రులు నారపాచ లై
పొమ్మని త్రోచినం గదలఁబోవు మనమ్మ వశమ్ముగాదు గా
త్రమ్ములు విశ్లథమ్ము లవు దారి విదారితధైర్య నైతిఁ బో. ౧౯

ఉ. ఆఁకట నిల్వఁజాలఁ బురమా? పరమా? యెటుఁ గానరాదు నే
నో కలుషాపహా! యిచట నుండెద నింకిటఁ బొమ్ము నీవు నా
కా కమలోద్భవుం డెటుల నాననమందు లిఖంచె నట్టు లొఁ
గాకులొ? గ్రద్దలో? మఱియొకండొ? యిఁకేమి వచింతు నక్కటా!

క. అని క్రిందఁ గూలఁబడి యె
త్తిన లేవనలేనియ ట్లొదిగి నవలా ప
న్నిన పన్నాగమునం బడి
మునిపుంగవుఁ డిట్లు లనియె మునుకొను జాలిన్. ౨౦

మ. లలనా! నీ నునుమేని మెత్తనకు మేలా? యిట్టి యిక్కట్టు లో
కు లనం గాకు లటంచుఁ జంకెదను నాకుం జిత్త మాయత్త మీ
లలి నాపన్నవు కాన డించి చన నేలా గొప్పు? ని న్నూరుముం
దలకుం జేర్చెద మోచియే నిజభుజాస్తంభం బధిష్ఠింపుమా. ౨౧

క. అని డగ్గఱు మునితిలకునిఁ
గని సంతస మెదఁ దలిర్పఁ గాంతారత్నం
బినసన్నిభ! ముట్టఁగ వ
చ్చునె? పరపురుషులను నాకు సువ్రత కనినన్. ౨౨

ఉ. ఆ య్యతిముఖ్యుఁ డాత్మఁ బ్రమదాంబుధి ముంపఁగ మెచ్చి తొయ్యలి
కొయ్యకు నాకు జాతికి నొకండు వికారము మాట వుట్టునే?
దయ్య మెఱుంగుఁ జిత్తము కదా సునిమిత్తము బంధముక్తులం
దయ్యది సుస్థమైన కలదా? దొసఁగించుక యే నటం చొగిన్. ౭౩

గీ. బుజము నెక్కించుకొని నన బోఁడిఁ గొనుచు
వడివడిగఁ బోవ జొచ్చె నా వశివరుండు
నెవ్వగ లొకింత వెనుబడ నేర్పు మెయిన
యల విలాసిని చేయు చేతలకుఁ గాక. ౭౪

గీ. ఇను మనఁగవచ్చు మనసుఁ గానీ మిష మిది
దివ్యదృష్టి నెఱుంగ నా తెలివి కలిగి
యలతలఁపు లేక జాలి ని య్యలజడి వడు
కారణంబు ప్రారబ్ధంబ కా దిఁకొండు. ౭౫

గీ. స్విన్న రోమాంచవతియుఁ గంపితయు నగుచు
శుచిరసంబునఁ దోగు నా సుదతిఁ గాంచి
శ్రమజనిత మంచు నెంచి యా సాధు వరుగ
నగపడెను భోగవతి దివి నగెడు నగరి. ౭౬

వ. మఱియు నప్పురవరంబున సవతు లవు నచలయు సిరియుఁ దమ తమ
గొనంబు లొక్కొక్కొకళ్ళకుఁ బరివర్తించుకొనిరి. శుభలక్ష్మీస్వయంవర
స్థాన మ్మవు నాయూర బారులు తీర్చి కట్టిన సౌధాగ్రంబులు వరణీ
యాశ్రయంబు లౌ మంచె లని యెంచెద. ఆమేడల రత్నకాంతి
పూరంబుల నెసకం బెసంగు నరులు నారాయణులు గాకుందురా?
వారల మోసల నాసలు గొల్పు సుభద్రలు మాత్రము రుక్మిణు లని
నొక్కి వక్కాణింపవచ్చును. సత్యభామాభాసురం బగు నన్నగరంబు
గోవిందమందిరంబే కదా? దుశ్శాసనం బవు నది దుర్యోధనపద
మూనదా? యాచార్యకృపాభిరామం బగు గాంగేయసంగతి గల
యది భారతమే కదా? పంజరబందీకృతశకునిరాజం బగు నచ్చట

దుర్ఖ్యాత ప్రకరణము మాత్రము లేదు. శత్రుఘ్నులవలన విశ్రుత కీర్తులు మెలంగుట, భరత పుత్త్రాకరంబగుట, సలక్ష్మణాలు నూర్మిళలు నన నగు సరసులచేఁ బ్రకాశించుట, సీతాఫలానుభవాభిరామం బగుట ననేకదశరథభాసురం బైన యానెలవు నూతనరామాయణ మనఁ జెల్లు. సుగ్రీవులు విభీషణులు హనుమంతులు నీలులు ద్వివిదు లవు వార లంగదసంగతు లై యుండుట తత్ప్రబంధములోనిదియే. అచటి మార్గంబులు శ్రుతులు పదక్రమాచితంబులు. వైజయంతీవిలాసములు రతిరహస్యములు కలాపూర్ణోదయములు నచ్చటనే చదువవలయును. ఇట్టి చట్టములు గల పట్టణము సమీపించి య య్యెంచితుఁ డ మ్మించుఁబోఁడి డించుటయు నయ్యిరువురు నందుఁ జనఁ జన. 22

సీ. కల్పితశైలసకాశయాతాయాత
చారూచ్చరచ్ఛుకశారికంబు
కేలీమహోద్యానపాలికాకరతల
పరిమళమిళితాళివనితగీత
మంతఃకోమలయానిలాంచితపరిసర
ద్రాక్షానికుంజసందానితంబు
సర్వతోభిత్తిప్రశస్తశిల్పినిబద్ధ
చిత్రవిరచనావిచిత్రతరము
తతఇతస్సంచరత్ప్రమదావిమర్ద
నిస్సరత్సౌమసౌరభనిచితకలిత
చంద్రశాలావిశాలభాస్వరసురసవి
సరము గనిపించె నచటఁ బ్రాసాద మొకటి. 23

క. ఆ మేడలోనికిం జని
యా మహిలాతిలక మప్పు డామునిఘను రా
వేమయ్యా! యని నెయ్యము
తో మంచిగఁ బిలిచి చెలులతో సాదర యై. 24

గీ. ఆసనమ్మున నునిచి పాద్య మ్మొసంగి
యర్ఘ్య మర్పించి యెంచి సంయమివరేణ్యుఁ
బూలప్రోవులఁ బూజించెఁ బూవుఁబోఁడి
భక్తిభూమిక నెద రతి పల్లవింప. ౬౦

ఉ. అంతట నాతఁ డోలలన! యచ్చపుబత్తిని బూజసేసి తీ
వింతయు మామనంబునకు నెంతయు మెచ్చొనరించె నింక నీ
కాంతునిఁ గూడి సంతతి సుఖంబులఁ జెందుము పోయివచ్చెదన్
జింతలపాలు గాక యిలు సేరితి వింతియ చాలు నా కనన్. ౬౧

క. నీ దయఁ దలంగె దుఃఖము
లాదరమున నను మనిచితి వౌరా యనఁగా
నోదయితగుణా! తగదే
మాదరిఁ గొంతతడి నిలిచి మన్నన వడయన్. ౬౨

క. ఆలుం బిడ్డలు గలరే?
పోలే దని యెడ్వ మించి పోవునె? యెదియేన్
మేలా దాసుల విన్నప
మాలింపమి యనిన వాఁడు నాదర మొప్పన్. ౬౩

చ. పిడికెడు భిక్ష వెట్టు మని వీథుల వెంబడి పోయి యెవ్వ రే
మిడినను దృప్తి సెంది హృదయేశ్వరు విట్ఠలు భక్తిఁ గొల్చు చె
క్కడ నిలువం దలంపక జగంబులఁ ద్రిమ్మరుటే వ్రతంబు నేఁ
గుడువఁగరాద యొక్కయెడఁ గూరిమి గల్గినయేని సుందరీ! ౬౪

చ. పనిచినఁ బోయి వచ్చెదను బద్మదలాయతలోచనా! యనన్
విని తన సద్వ్రతంబుసరవిం జని నెచ్చెలులిండ్లయందుఁ దె
చ్చినయది నే నొసంగెదు విశిష్టపదార్థముతోడ నేఁడు భో
జన మొనరించి నిల్వఁదగు సర్వము నీ దయ మా యదృష్టమున్.

క. అని దీనత వేఁడెడు కోమఁ
గని మఱుమాటాడలేక ఘనమతి యటు ల

ప్పని దీర్చి పవలు గడపెం
దనికె నినుఁడు పశ్చిమాంగనాతత్పరుఁ డై. ౫౬

క. ఆగమలాలితుఁ డినుఁ డన
మాగ న్వారుణాశఁ దవిలె నన ద్విజరాజా
ప్రాగంగన దరిఁ జేరం
గా గమకించెం బ్రపంచగతి యిదియ కదా. ౫౭

చ. ఇనుఁ డగుఁ గాక కర్మముల కెల్ల నొకం డగుఁగాక సాక్షి భా
మనిధి సహస్రభానుఁడు ప్రమాదముచే నొక పశ్చిమాంగనన్
జెనకి ఘనత్వ మోజమును జేడ్పడ నిర్వసుఁ డై వడిం జగం
బున మొగ మెత్తలేక చనఁబోయెడుఁ జాటున కేమి సెప్పుదున్?

వ. ఇమ్మాదిరి జగచ్చక్షువు వోయె నని యుదయించి యుత్పథమ్మున వర్తింప నెంచు నించువిలుకాని మామ మైఁ గ్రమ్మిన రజస్తమోవికారంబులఁ గాలంబ కాక తార లితరులు దుడువ నోపకునికి విదితంబ కదా? తనత్రోవన పోయెడువానికి నడుమఁ దటస్థించి యొక సరాగరాగ మాపాదించినఁ బాప మాత్రం బేమి సేయు? అట్టివారికి దిక్కు కాలమే. నడుమ వచ్చిన చెడుగు నశింపఁ గలానిధులు పరిశుద్ధులగుదురు. తాదృశుల దీప్తి యప్పటికి రోదసీకుహరంబెల్ల నాక్రమింపకుండదు. పరమేశ్వరానుగ్రహం బింతకు గమకము. ఇంత యంతకుఁ దెల్లం బయిన నింకఁ జెప్పవలసిన దెద్ది? అయ్యెడ మీఱిన మారుని యారంభమునకుఁ జేయరామి కన్పట్టదయ్యె. అయోగిజనుల మాదిరి వియోగిజనులఁ గూడ రాపాడఁ దొడఁగె. కుసుమంబులం బోలె నారుల నారాచంబులఁ జేయుచుండె. చెడి బ్రదికినవారి చెయ్వుల కోర్వవచ్చునా? అప్పుడు వారితోఁ గలసిన పవనుండ మందుం డనయ్యె. ఈ మూఁకల బందెపోటుదొంగతనంబు వారింపరాకుంటయు నెల్లవారుఁ దమయంతఃకరణద్రవిణంబులఁ జూఱవదలిరి. వారికి నాఁత మొనంగు నితంబినుల కయ్యదనున, సాధింపరానిది లేకుండె. అట్టియెడ. ౫౯

ఉ. ఆగజగామినీమణి యొయ్యారము మీఱఁగఁ జేరవచ్చి యా
యోగికులావతంసు పదయుగ్మము సన్నిధి భక్తియుక్తితో
సాగిలి మ్రొక్కి పల్కె వికసన్ముఖలోచనకంజపుంజ యై
శ్రీగురునాయకా! యని విశిష్టమనోహరవృత్తిఁ బిల్చుచున్.

క. మన గృహ మొకపరి దిలకిం
పనలేదు మనీషివర్య! పర్యాప్తముగా
ననుకంప వలదె? తగునే?
యనాదర మొకింత నేలయందు నధీశా!

సీ. పున్నాగపాటలీముఖవృక్షలతికావి
తానమానితము లుద్యానవనము
లలిగుంజనానుకీరాలాపకలితపి
కారవాఢ్యములు విహారభూము
లాదర్శమణివిచిత్రాలేఖ్యదర్శనీ
యము లైన మేలి గర్భాలయములు
పండువెన్నెల నిండఁ బర్వి పండువు గూర్చు
సమవిశాలము లైన చంద్రశాల
లజిత! నీపాదరాజీవరజము సోకి
పావితంబులు కా వలదే? వలచినఁ
గదలి యన్నపుడెల్ల రాఁ గలవె? దేవ!
యవధరింపుము విన్నప మదియుఁ గాక.

క. అంగజజనకుఁడు రంగఁడ
నంగజయా! మాకుఁ ద్రాత యవు నిలువేల్పా
సంగతి నీ యెఱుఁగనిదే?
యంగీకారంబు సూపు మా విభుఁ గాంచన్.

గీ. రంగదేవరతీర్థంబు రాజిత మవు
దక్షిణావర్తశంఖసంధారితంబు

భవదభయదానచణకరాబ్జప్రసంగ
పావితం బై తొలంచు నాపాపములను. ౯౪

క. దయసేయు మనఘ! యన న
న్నియతాత్ముం డిచ్చమెచ్చి నీరజవదనా!
యయమహితుఁడు విట్ఠలు నీ
ప్రియదైవమె? యెంతదానవే? కమలాక్షీ! ౯౫

క. నీ వినయము భక్తియు సం
భావన భావంబు నన్నుఁ బరవశుఁ జేసెన్
నీ వినిచినయవి యెల్లన్
భావిని! చర్చించి చూడవలయుం జుమ్మా. ౯౬

గీ. మొట్టమొదటి ప్రసంగంబు పోల్కి సూచి
నిన్ను నిరసించి పలికిన నేర మెన్నఁ
బోకు మాత్మేశుఁ డైన లోకైకనాథు
భక్తురాలవు నీ వని పడఁతి! యెఱుఁగ. ౯౭

క. అని సమ్మతించి వెంటం
జనుదేరఁగఁ జాన వాని సరవిం దన చె
ప్పిన నెలవు లెల్లఁ ద్రిప్పుచు
నను నొప్పం జేర్చెఁ దద్గృహాభ్యంతరమున్. ౯౮

ఉ. అచ్చటఁ బాండురంగవిభు నాకృతిఁ జూచుచు సంతసించుచున్
మెచ్చుచుఁ గొల్చుచుం గలిమి మేల్మికిఁ జొక్కుచు మాటిమాటికిన్
ద్వచ్చరితంబు లిట్టి వని తన్వి! యెఱుంగకపోయితిం గదా?
యచ్చెరువయ్యె నీ మహిమ మంచు నతండు నుతించుచుండఁగన్.

ఉ. నాతుల నీతుల న్నిధువనంబుల రీతులఁ బ్రీతులన్ దివా
భీతుల పక్షపాతముల పీతవిశంకరసప్రభాతపుం
భాతులఁ బత్త్రహారముల వంకరకూఁతల వేఁగి యొగ నొ
రాతిరి కొంగు వట్టికొని రాజు విదిర్పఁ బడెం గుభృత్తటిన్. ౧౦౦

వ. అనిన ననంతరకథాసంవిధానంబు నభ్యర్థించుటయు. ౧౦౧

గీ. చెన్న కేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహి సమర్పిత మైన యామావికఁ గృతిఁ
బ్రచిత మైనది యాదిమప్రకరణ మిది. ౧౦౨

గీ. తాడెపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిటు. ౧౦౩

శ్రీ శివాయ గురవే నమః

# యా మా వి క

## ద్వితీయ ప్రకరణము

ంనతరసంసృతిప్రసృతికౌతుకపాశనిబద్ధమైన వృ
నిచయము స్వబోధకలఁ దజ్జ్ఞులఁ జేయఁ దలంచి పిన్న య
య్యను దనుఁ గన్నవారి ఋణ మొల్లమిఁ దెల్పు మహాత్మ దక్షిణా
ర్యని వినుతింతు నిష్ఠ ధిషణోర్జితశక్తిసమృద్ధికై మదిన్.

*　　　*　　　*

శేకర చందోలుపురీ
పాకటలింగోద్భవేశ్వరప్రాసాద
క్ష్మాకలితదక్షిణాశా
ప్రాకారముఖప్రకారభాస్వత్సదనా! ౧
అవధరింపు మా త్రయికి నీపేరి విబుధుం డి ట్లనియె. ౨
తులకించు మేలితీవల నెయ్య మొప్పార
విప్పారు మాకుల యొప్పుఁ గాంచి
పింగంపుగొందముల సిలుఁగుల నెఱుఁగక
మత్తిల్లు గజముల పొత్తుఁ జెంది
యంచల పెంపున కించు జలమ్ముత
మ్మ్ము లెసంగు కొలఁకుల నెలమి నెనసి
కోయిలల్ చిలుకలు గోర్వంక లాది యౌ
పులుఁగుల పలుకుల పొలపము గని
యెఱుకుఁదలిరాకుఁబోడుల కఱపు లూది
బలిమి నడచెడు పూవ్రుటమ్ముల దొరకును

మునుల మనము లలవరింప మను వివేక
ధీనిధికిఁ గూర్చు నొక యరణ్యానిలోన.

ఒకయోగి - తీర్థయాత్ర

సీ. స్వచ్ఛందగతము పక్ష్మముల నాగిన చూడ్కి
నాసాగ్రమునఁ బరిణతి మొనర్చి
పర్యంకబంధసంబంధసుస్థిర మైన
కాయంబు మొగదల దోయిలి నిడి
నిట్టూర్పు లడఁచిన నియతిమైఁ గదలని
యుత్తరకాయంబు నొనర నిలిపి
పలుతెఱంగుల పోక లులియ శుద్ధతఁ గన్న
బుద్ధి నేకాకారమున నమర్చి
దైవము ల్వది సొలయఁ జిత్తంబుఁ బాచి
విషయతతి యెడఁబడఁగా నివృత్తిఁ జేర్చి
యన్నిఁటికిఁ బైన నలరెడు నాత్మ నెఱిఁగి
యొక్కఁడై యుండె నిష్ఠమై నొక్కమౌని.

క. ఆ మునివర్యుని తేజం
బామకొనఁగ నొదిగి యంబుజమిత్రుం
డా మహితు నామెతకు గని
కామము చల్లనము నెనసి ఘనగతి మెల గెఁ.

గీ. మందుఁ డగు మారుతుండు నా మహితుఁ గొల్వ
దృతుసమాహార మేల విహిత మెనయదు?
దుర్మదుండు మనోజుండు దూరుచోటు
గానరాకుండెఁ గాక సత్కారమునకు.

క. పులుఁగులు మెకములు నిచ్చలఁ
గల మచ్చరములను మాని ఘనసఖ్యమునన్

మెలఁగుచు నాతని యాశ్రమ
తలమందలి యెలమిఁ దెలుపుఁ దమ ధన్యతతోఁ. ౭

ఆ. అట్టు లుండియుండి యల తపోధనవర్యుఁ
డూర్పు వుచ్చె మొదల నుత్థితాక్షి
పక్ష్మఁ డయ్యె బిగియు పర్యంకబంధంబు
విచ్చె లేచె భూతవితతి మెచ్చ. ౮

గీ. ఈ విధి సమాధి వాసి యోగీంద్రుఁ డపుడు
కృత్యములఁ దీర్చి మెల్లనఁ గెలనివృక్ష
రాజములఁ దీవలను జేరి రాజితముగ
భిక్ష భిక్ష యటం చొగి వేఁడుటయును. ౯

సీ. ఒకకొమ్మ భక్తిమై నొసఁగె జూచినమాత్రఁ
జవులకుఁ దార్చు భక్ష్యముల గముల
నొకసరసి యొసంగె నొలపు లీనెడు పాక
మమరఁ జేసిన మేల్ రసాయనముల
నొకనగం బర్పించె నొదిగి కమ్మని దోర
పండిన సురసాలఫలవితతుల
నొకతీవ యప్పనం బొనరించె గమకించు
మొగ్గ తీయని కందమూలకముల
రమ్యవనదేవతాహస్తరాజిరాజ
దరుణరాజీవములతోడ వరుస నిట్టు
లెల్ల భోజ్యవిశేషంబు లిచ్చి మెచ్చి
కొలిచె నమ్మునివరు లతాకుజచయమ్ము. ౧౦

గీ. అర్థి నల్లపదార్థంబు లారగించి
యాచమించి మఱేమేమొ యాత్మ నెంచి
యచటినుండి ప్రయాణించు టర్హ మంచు
నిశ్చయించి వచించె నన్నియమిఘనుఁడు. ౧౧

ఉ. ఎచ్చటనున్న మీ హితమునే మది నెప్పుడుఁ జర్చసేసెదన్
నిచ్చలు నాపయి న్నెనరు నింపుఁడు భూజనులార! మైత్రితో
మచ్చర మేది వర్తిలుఁడు మానుగ సత్వములార! భూతముల్
మెచ్చగ వాని వీని కలిమి న్వనదేవతలార! పెంపుఁడీ. ౧౨

గీ. అరిగి వచ్చెదనమ్మ! పుణ్యాశ్రమమ్మ!
నీ దయాప్తి ఫలించె నా నియమమెల్ల
మిమ్ముఁ బాయఁగఁ గల్గె నిమిత్త మొకటి
మఱువకుఁ డటంచు వీడ్కొనె మానివరుఁడు. ౧౩

ఉ. అచ్చటు వాసి పోయి కలయం దిరిగెన్ హిమవన్నగాదిపు
ణ్యోచ్చయతచ్ఛిలోచ్చయము లూర్జితదివ్యసరోవరంబు ల
త్యుచ్చమునీశ్వరాశ్రమము లొప్పెడు సింధునదీనదంబులున్
సచ్చరితుం డతండు జనసంస్తుతసత్క్రియ లాచరించుచున్. ౧౪

గీ. విశ్వపతి మాధవుని డుంఠి విఘ్ననాథుఁ
జక్రపాణి భైరవు గుహాసహితఁ గాశి
గంగను భవాని మణికర్ణికను నుతించి
మ్రొక్కె నచ్చోటి కరిగి యమ్మునిమహితుఁడు. ౧౫

వ. మఱియు నచ్చోటి మహిమాభిమర్శంబున ధన్యంమన్యుం డై యావే
శంబున. ౧౬

మ. కనుఁగొంటిం గనుఁగొంటి గౌరి శుభవక్త్రిం బందుఁ గన్గొంటి నేఁ
గనుఁగొంటి న్నవపల్లవాధరము ముక్తాదంతసంస్ఫీతమున్
గనుఁగొంటిం గనుఁగొంటి నందును హిరణ్యజ్యోతిరుద్దామభీ
షణసామ్యాకృతి విశ్వనాథపదపంచక్రోశభూలింగమున్. ౧౭

మ. మును దాక్షాయణి యోగవహ్ని సుహితమ్ముం జేసి తన్నేర్పఁ ద
త్తను వంసస్థ మొనర్చి శంభుఁడు లసత్సంరంభుఁ డై తాండవిం
చిన శార్ఙ్గచ్యుతసాయకాళి విశసించె న్దాని విష్ణుండు త
త్తనుఖండంబులు వడ్డతావు లివి క్షేత్రంబుల్ ధరం బేర్పడెన్. ౧౮

గీ. ప్రకటములు క్షేత్రము లవి పరశ్శతములు
వానిలో గారివక్త్రంబు వరణ కసికి
నడిమిదేశంబునం బడి నామ మొనసె
వారణాసి యనఁగ క్షేత్రవర మిది యని. ౧౯

గీ. గాత్రములలోఁ బ్రధానంబు గాదె? వక్త్ర
మది వడినచోటు క్షేత్రముఖ్యంబు కాశి
కడమతావుల కరుగ వీ ల్లానివారు
కాశి కేగినఁ జాలుఁ బుణ్యాశ ననియు. ౨౦

గీ. వ్యాసుఁడే చెప్పెఁ గనులకు వారణాసి
యుజ్జ్వలైశ్వర్య మమరె న చ్చొత్తినట్లు
లే దెసం గన్న విశ్వేశు నేధమాన
మోజమే కాక కాన్పింప దొండు రూపు. ౨౧

శా. పంచక్రోశము విశ్వనాథుని లసద్భారూప మం దే జనం
బుంచం బాదము దానిలో మునుఁగు మే నూడ్వంగ నా నేని నా
వంచా దా నదె యా విముక్తి యనఁ దద్భావంబె యా నంచు ము
న్నెంచంగాఁ బడె నేఁడు గాంచఁబడె నే నే ధన్యమూర్ధన్యుఁడన్. ౨౨

గీ. గంగగర్భంబునను జొచ్చి కాశిఁ జొచ్చి
చచ్చియును మాతృగర్భంబు సొచ్చెనేని
వేదశాస్త్రపురాణసంవాదము లవి
వేడుకకె కాక యే మంచు విలువ గాంచు? ౨౩

గీ. అని యనుభవించి కొని నాళ్లు లచటనుండి
పయనమై పోయె నాతం డుపాయ మెదియొ
ముందు వెనుకయు వరుసయు మొనయఁ బోవు
వాని యాత్రకుఁ దోఁచిన పథమ కాని. ౨౪

శా. కాళీదేవి నుతించె నంచితమతిం గల్యాణయత్నుండు త
త్కాళీఘట్టమున న్నయం గనియె లోకఖ్యాత మప్పాదమున్

నాళీకాసనుఁ డాచరించె మును జన్నం బర్థిమై నెందు న
క్కాళిందీసురసింధుసంగమమునం గావించె సుస్నానముల్. ౨౫

గీ. వేయి వత్సరములు దున్ని వివిధసుకృత
బీజచయ మక్షయమ్ముగ విభునివలన
వరముఁ గొని జన్నములఁ జేసి కురువిభుండు
కీర్తి నెనసిన తత్కురుక్షేత్ర మెనసి. ౨౬

గీ. ప్రకటగుణశాలి యా సరస్వతి తటమునఁ
జనుచు మంకణమునివరాశ్రమము గాంచి
బదరిపాచనతీర్థంబుఁ బ్రస్తుతించి
పరిసరంబునఁ గల పుణ్యావనుల మెట్టి. ౨౭

క. గోకులబృందావనముం
బ్రాకటముం జేరి విభుని ప్రాభవ మెల్లన్
శ్రీకరవాక్ప్రసవమ్ముల
నాకృతి పూజించి మించు నాదర మెసఁగన్. ౨౮

క. అంతరమున నుండిన తీ
ర్థాంతరముల నాడుచున్ మహాత్ముం డెనసెం
బ్రాంతమునఁ బండరాపురి
కాంతరముదుదనిధి పొంగి యలువులఁ బాఱన్. ౨౯

శా. మార్గం బెల్లఁ గ్రమించి భైరవుని సన్మానించి తత్సమ్మతిన్
భర్గు న్వర్గచతుష్టయప్రదు నదభ్రప్రీతిఁ బూజించి యా
దుర్గన్ నారదు వాణి హ్రీంకృతి నతిస్తోత్రమ్ములం గొల్చి యం
తర్గేహంబునఁ జేరి యారసి విభుం దాత్పర్య మొప్పారఁగన్. ౩౦

క. అష్టాంగప్రణతుం డై
శిష్టాగ్రేసరుఁడు వాగ్విశేషప్రౌఢిన్
విష్టపమనీషితాను
స్పష్టం గొనియాడె విష్టరశ్రవసు నిటుల్. ౩౧

సీ. పూతనాజీవితమ్ము‌ను బాలతోఁ గూడ
నెలసి క్రోలిన మోవి యిదియకాదె?
శకటాసురుని రూపు చైతన్యమును జెడ
నెగసి తన్నిన పాద మిదియకాదె?
వెసఁ దృణావర్తు నూపిరిఁ గంఠముం గిట్టి
పొదివిన భుజయుగం బిదియకాదె?
గోగోపులభరంబు గోవర్ధనధరంబు
నెత్తిన చిటికెన యిదియకాదె?
పుండరీకు మదికిఁ బూఁబోండ్ల కన్నుల
కెలమి గూర్చు మూర్తి యిదియకాదె?
మమ్ముఁ బోంట్ల మానసమ్ముల తామసం
బెల్లఁ జెఱుచు వెలుతు రిదియకాదె? 32

సీ. చంద్రభాగానదీజలకేళి మరగితి
పాలమున్నీటి సంపద మఱచితె?
రాధికచెయ్వుల రారాపులకు లోగి
తిందర పరిచయం బేమి సేసి?
తవధరించితివి భూభువనంబ మే లని
వైకుంఠ మెవ్వరి పా లొనర్చి?
గొల్లల గోడెలఁ గొలిపించుకొనుచుంటి
వమరేంద్రముఖ్యు లేమైరి? చెపుమ!
హాయి గూర్చెడు మృదుల శేషాహిదేహ
తల్ప మే మయ్యె? నిద్దుర తలఁగె నెట్లు?
పుండరీకుఁడు గిరి గీయ భువననాథ!
తెప్పిరిలకుంటి వేమి మంత్రించెనొక్కొ? 33

చ. మతకపుమారి రాధిక యె మందులు పెట్టెనొ? వేరు ద్రొక్కితో?
నుతమతు లైన యోగుల మనోవివరంబుల కందరాని నీ

వతిరసవృత్తి గేహ మధిపా! యెడఁబాయవు పౌండరీకసం
స్థిత జనభాగధేయ మది సెల్లును బో యమరత్వ మేటికిన్ ? 38

ఉ. ఎక్కడ నున్న నో జగదధీశ్వర! నీ దయ కెందు ద వ్వటం
చొక్కటి లేదుగాన నను నొప్పరికింపకు దుష్టమార్గముల్
ద్రొక్కెదనో? దురాగ్రహముతో దురితంబులఁ బ్రోవుసేతునో?
చిక్కెదనో కొ? మాయల క శేషము నీభర మెట్లు సాకెదో? 39

క. అని యిట్లు బహువిధంబుల
ననితరసాధారణుఁడు మహాముని రాధా
వనితాలోలుఁ బొగడి పి
డ్కొని చనునెడ భైమిఁ జూచి కుతుక మెలర్పన్. 3౬

శా. గంగామూర్ధజు పావనాంగకము లాకారంబు గల్పించె నా
గంగాకారణపాదపద్ముఁడు నిను న్గాంతుం గటాక్షించె నా
గంగాసంగతి మెచ్చకే యుదధి సౌఖ్యం బందు నీ యందు నా
గంగారానిదె? మాదృశాఘ మురుభోగా! చంద్రభాగానదీ! 32

మ. అని భైమిం గొనియాడి వాఁడు చని మధ్యాధ్వస్థతీర్థాళిఁ గ
న్గొని భక్తిం దలపోయుచు న్మనుఁగుచు న్గొన్నా ళ్లుపాసించుచున్
మునిసమ్మానితచిత్తపద్మసదను న్భామామహాభూషణున్
ఘనతాపాపహు మోక్షదాతఁ గనె ద్రాక్షారామభీమేశ్వరున్. 3౮

క. గోదావరీమహానది
నా దుష్టవిదూరుఁ డెంచి స్నాన మొనర్చెన్
వేదార్థంబులఁ బొగడె
న్సాదరముగ భీమనాథు హరు దురితహరున్. 3౯

క. సంతోషంబున నెడనెడ
దంతురితస్వాంతుఁ డగుచుఁ దత్తీర్థా
భ్యంతరసీమల కేగుచు
నంతర్వేది నరసింహు నభ్యర్చించెన్. ౪0

శా. కృష్ణాసాగరసంగమంబుఁ గని సంకీర్తించుచుం గ్రుంకి శ్రీ
కృష్ణుం గొల్చి తదీయతీరమున నేగెం బున్నెము ల్సేయుచున్
దృష్ణాదూరుఁడు శ్రీగిరీంద్రవిభు నర్థిం గొల్వఁ దచ్ఛృంగమున్
భూష్ణూత్పత్తిహరంబుఁ గన్గొనె మనోంభోజంబు విప్పారఁగన్. ౪౧

క. పాతాళగంగలోపల
స్నాతుం డై పోయి "భూతనాథ! నమస్తే
త్రాతాత్మీయాయ" యటం
చాతురుఁ డై చేరి మల్లికార్జునుఁ దెలచెన్. ౪౨

మ. ధనదాప్తా! భవదీయశృంగము భవధ్వంసంబుఁ గావించుఁ జూ
చినఁ బొమ్మంచు వచించు నాగమము లర్పింపంగ నీ విచ్చు నా
ఘనతం దెల్పఁగ నేరవాయె నభవా! కాంక్షింపఁగారాని కా
మనలా? నీకరుణావిధేయము లదంభా! శ్రీగిరీశప్రభూ! ౪౩

శా. కన్నుల్ మాయ జగమ్ము మాయ మన మేకైవల్య మూహించు సం
పన్నుం డౌ ద్రుహిణాండ మెల్ల నదె యాభాసింపఁగాఁజేయు నం
చెన్నన్నాని భవన్మహత్త్వమున కే యీ టీక శ్రీశైలమ
ల్లన్నా! నిన్ను వినాగ గల్గు నెవఁ డధ్యక్షుండు సర్వంబునన్? ౪౪

క. అని సన్నుతించి యభిషే
చన మొనరించి భ్రమరాంబ సామాంజలులన్
మొనయించి వేఁడుకొని మఱి
వినమితమస్తుఁ డయి కొలిచి వీడ్కొని చనియెన్. ౪౫

చ. అటు చని కృష్ణవేణిఁ గొనియాడుచు మంగళశైలవాసు ను
ద్భటు నరసింహు నవ్విజయవాటిక నెక్కొను హేమదుర్గ సం
కటహరు మల్లికార్జునునిఁ గన్నుల కింపుగఁ గాంచి యెంచుచున్
బటుమతి కాళహస్తివిభు భక్తజనావనలోలుఁ గన్గొనెన్. ౪౬

క. శ్రీకాళహస్తినాథున్
శ్రీకరసద్భక్తిఁ గొలిచి సేవించెను గాం

చీకటకర్ గామాక్షిం
బ్రాకటగుణుఁ దెలచె వరదరాజస్వామిన్. ౪౭

క. మంగళముల నర్చించె సు
సంగతవాగ్విస్తరముల సర్వపతితనూ
రంగతల శాయి శ్రీశ్రీ
రంగేశ్వరు రంగనిన్ నిరంజనమతి యై. ౪౮

ఉ. అంతటఁ బోయి పోయి యనఘాకృతి యాకృతి తీర్థరాజి న
భ్యంతరసీమలం గనుచు నక్కడ నక్కడలిం గనుంగొనెన్
మంతున కెక్కినట్టి కపిమాన్యుల శిల్ప మనల్పమున్ మనః
కాంతము దైత్యదానవనికాయశుభాంతము సేతుశాంతమున్. ౪౯

శా. శ్రీరాము న్వినుతించుచుం గపుల వాసి న్మెచ్చుచుం జేరి యా
క్షీరస్వాంతుఁడు దాన మాడి యుదధిం ధీయుక్తి సేవించి సం
సారారణ్యదవానలుం దరిసెఁ గాంక్షన్ రామలింగేశ్వరున్
దూరాపాస్తనతార్తివిస్తృతి దయార్ద్రున్ బ్రహ్మహత్యాహరున్.

మ. అభిషేకించి యజించి సంచితమనోహర్షంబుతో నాతఁడ
య్యిభచర్మాంబరుఁ బ్రస్తుతించి యపురా యెట్లబ్బె నీ భాగ్యమ
స్తభయం బయ్యె హృదంబుజంబు మునినిశ్చాంచల్యచేతశ్శ్రతా
నుభవాధ్వశ్రమమృగ్యమాణు విభుఁ గన్గొంటి న్నినుం గంటితోన్.

క. జననాథార్చితుఁడవు ప్రా
ణ, సనాథుల నెల్లఁ బ్రీతి సాకెదవటె ని
ర్జననా! ధార్మికనుతిభా
జన! నాధివ్యాధికరణసదయసునయనా! ౫౨

క. అని పొగడుచు నై వొంగం
బ్రణామము లొనర్చి వెడలి బహుపుణ్యాకరా
వనిభాగంబులఁ దిరుగుచుఁ
గనుఁగొనియెన్ వేంకటేశుఁ గలికాలవిభున్. ౫౩

## ద్వితీయ ప్రకరణము

క. ఆ దేవున కా ధీనిధి
సాదరభక్తిప్రదక్షిణానతిశతప్రా
జాదికవరివశ్యల సం
పాదించె నతిప్రసన్నభావస్ఫూర్తిన్.

సీ. వేదంబుల కనేకవాదంబులకు నీవ
కావె లక్ష్యమ వయ్యుఁ గానరావు?
సాగరంబున నాగశాయిత్వమునకన్న
నగసంచరణకేళి నచ్చెనొక్కొ?
మునిమానసాంభోజముల భాగధేయమా?
చెంచుచానల పాలు సేసితి బళి
దేశముల్ లేవె? భక్తి నుతింపరే పరు
లకట యింపాయెనే యహోబలాద్రి?

మమ్ము నొకకంటఁ గనిపెట్టి మనుపు మనుచు
నర్థిఁ బ్రార్థింపఁగలవార మంతెకాని
విభుని చేతలలోఁ గల వెలితిఁ దీర్చు
నంతపని మాతరంబె? సర్వాంతరాత్మ!

సీ. బలిచక్రవర్తి వాకిలి గాచు పనియింకఁ
దీరు నెన్నాళ్ళకు దేవదేవ!
బ్రహ్మహత్యాఘంబు బదులని చేసితే?
స్త్రీహత్య లొకటికి రెండుమారు
లసురులఁ గెడపు సల్లాలు గావలెనేమి?
గడుసు పెండ్లామును గట్టుకొంటి
వలరు పురంబు గేహంబు పాడ్వడఁ గొండ
పీడుపట్టులఁ దిరుగాడుచుంటి

వెల్ల సిరు లల్ల సురలకుఁ గొల్లపెట్టి
యెన్నుకొనుఁ డని వారి యిం డ్లిల్లఁ దిరిగ

దీశ్వరత్వంబు సాధించు నిచ్చ యేల?
కానిపాట్లెల్లఁ బడనేల? కనకచేల! ౫౬

శా. ఈశుం డన్నను నీ వటన్నఁ గలదే? యింతేని భేదంబు స
ర్వాశాపాశనిరాసభాసురవశీంద్రామేయచిత్తాబ్జభృం
గా! శస్తం బవు నీకటాక్షకలనం గల్యాణబుద్ధిక్రియా
దేశంబుం గలిగింపుమయ్య కృతి నిర్విఘ్నంబుగా నంచితా! ౫౭

క. తట మెనయరాక సంసృతి
తటినిం బడి మడియు బరువుఁ దాలిచి ప్రోవం
బటుఁ డీ యుర్విఁ "గలా వేం
కటనాయక" యనుచుఁ బొగడెఁగా స్మృతి నిన్నున్. ౫౮

చ. కొలిచెద నంచు మానుకొను క్రూరులఁ జెప్పునఁ గొట్టి కానుకల్
బొలబొల ప్రోవుసేసికొన భోగము మోక్ష మొసంగి ప్రోవ ని
య్యిల నినుఁబోలు వేలు పొకఁడేనియుఁ గల్గునె? మెచ్చవచ్చు నీ
పిలిచినఁ బల్కు నాదృతి యభీషణ! తిర్పతివేంకటేశ్వరా! ౫౯

ఉ. నీకు మనం బమర్చిన మనీషికి లోపము లేదు సర్వలో
కైకశరణ్య! నా దొసఁగులెల్ల హరింపుము సెందినాఁడ ని
న్నీ కలికాలదైవతమ వీ వని నమ్మి కృతార్థుఁ జేయుచో
నే కెలసంబుఁ జూపెదొ? మహేశ్వర! తిర్పతివేంకటేశ్వరా! ౬౦

క. అని కొనియాడుచు నానతు
లనేకము లొనర్చు మాని నాదరదృష్టిం
గని శేషగిరీశుం డి
ట్లను ననుమానంబు లేని యాలాపములన్. ౬౧

శా. వత్సా! త్వత్సముఁ డెందుఁ గల్గునె? భవద్వాంఛార్థసందోహసం
దిత్స న్వేలుపులెల్ల నీ కభిముఖుల్ దివ్యంబు లౌ తీర్థముల్
సత్సంగంబులు నాదరించు చొగి దేశం బెల్ల వీక్షించి ని
ర్మాత్సర్యా! కృతిసిద్ధిఁ బొందెదవు సన్మానం బనూనంబుగన్. ౬౨

క. ఈదేశంబునఁ దిరుగుచు
నే దారి న్మెలఁగు నీదు హృదయ మెనయు మీ
వాదరమున నా విధి నా
యాదేశం బగుట లేద యఘ మమలాత్మా! ౬౩

గీ. అనుచు నేమేమొ బహురహస్యములఁ దెలిపి
సరసముగ వేంకటేశ్వరస్వామి వనుపఁ
ప్రణతుఁడై మునివరుఁడు స్తోత్రము లొనర్చి
వీడుకొనిపోయి తిరిగ నా విషయమెల్ల. ౬౪

వ. అను సూక్తుల నాసక్తిఁ గొనియాడి యామీఁది వృత్తాంతం బడుగుట
యును. ౬౫

గీ. చెన్నకేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహిసమర్పిత మైన యామావికఁ గృతిఁ
ప్రచిత మైనది రెండవు ప్రకరణ మిది. ౬౬

గీ. తాడేపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిటు. ౬౭

క. వెలలేని పుష్పరస మా
గలముం దెగఁద్రాఁగి స్మారకల్యాణంబుం
జెలరేఁగి పాడు భృంగా
వలుల కెలసమునకు నుత్సవంబు నెనయుచున్. ౧౯

మ. కమనీయక్రముకాటవిం గడచి ద్రాక్షాకుంజపుంజం బప
శ్రమతన్ లోఁగొనఁ బోయిపోయి మధుమాసశ్రీమహాంతఃపుర
క్రమసశ్రీకము సంస్కృతంబు స్మరదుర్గస్థాన మంతర్వణం
బమరప్రార్థ్యముఁ జేరి యాచితికి యోగ్యం బౌ నటు ల్నిల్చినన్.

క. రసభావాధ్వవిహారణ
ప్రసితులు కవివరులు వచ్చి వర్ణించిరి త
ద్వసతిద్యుతి నుత్ప్రేక్షా
ప్రసంగభంగీప్రవీణభావస్ఫూర్తిన్. ౨౦

సీ. విభజించి యిచ్చిరో? వేల్పులు చిరపుణ్య
ముని మెచ్చి దీని స్వర్భువనమందు
నన్నను గ్రేడించి యంగజన్ముఁడు దీని
రచియించి పెట్టెనో? రతి మతమున
ముక్కంటి కంటికుమ్మ్రన కోడు మరున కం
బిక దుర్గ మిందు నిర్మించెనొక్కొ?
రత్నగర్భాత్వంబుఁ బ్రకటించెనో? యిల
త్క్షుబ్ధరత్నాకరాసూయచేత
నవుర! పూఁదోట లెటుఁగమో? యవసథంబు
లల్ల మయవిశ్వకర్మాదు లాత్మశిల్ప
వైభవంబునఁ గూర్పఁ బూర్వకవివరులు
గ్రంథములఁ దెల్ప వినమొ? యీ కలిమి నేఁటు. ౨౧

చ. అమరులకొల్వులోఁ గలదె? హాయి యటన్నది చాలుఁ జాలు సిం
ధుమథనసంగృహీతసుమనోమణిధేనుగజాశ్వకల్పకేం

దుముఖపదార్థసంస్తుతులు నొక్కి వచింతుము సాల విచ్చటన్
నిమిషసుఖానుభూతి కల నిర్జరనాథు శతాశ్వమేధముల్. ౨౨

చ. స్ఫటికమణీమయావని నభఃప్రతిబింబితచంద్రతారకా
స్ఫుటరుచి వల్లరీద్రుమసముత్కరపల్లవపుష్పగుచ్ఛసం
ఘటితమరీచి వైద్యుతసుఖద్యుతిసారవిధూమదీపికా
పటుకమనీయకాంతి యభవప్రభవస్ఫురణంబు గొల్పెడున్. ౨౩

మ. కలవే? పుట్టినచోట గౌరవము లే కల్యాణికిన్ రాకపో
కలు లేకుండిన నత్తయిల్లు సుఖమన్నాథార్థ మూహించితో?
యిల నా యిల్లని లేదుగా భుజగశాయీ! యంచుఁ బోర్వెట్ట శ్రీ
లలనార్థంబు సృజించెనో విభుఁడు లీలం గ్రొత్త వైకుంఠమున్. ౨౪

మ. అతిలోకం బవు మంటపం బదె సుధర్మాస్థానము న్మీఱు నే
ప్రతిభాశాలు రలంకరించిరొ? మణిప్రాలంబమాలావితా
నతటిత్తోరణరాజిరమ్యముగ నెన్న న్వైజయంతంబు సం
తతసౌభాగ్యము నొంద నూడిగము నాస్థం జేర రాకుండునే? ౨౫

గీ. లలితరస "కవిమాయావిలాసక" మని
ద్వారమునఁ గూర్చిరి మణీమయాక్షరములు
లక్ష్య మిటఁ గవిమాయావిలాస మొక్కొ?
ప్రకట "మాయావిలాసక" మొకొ? తెలియదు. ౨౬

గీ. అందు నందంబు చందంబు నందిన ట్ల
మర్చియున్నవి పీఠము ల్మణిమయములు
నడుమ నున్నది రత్నాసనం బొకండు
శిల్ప మది సూచి యజుఁ డభ్యసించుఁగాక. ౨౭

క. ఆ మంటపంబుచుట్టున్
శ్రీమందిరములు కలావిశేషసదస్సుల్
హైమాక్షరాంకితమ్ములు
బ్రాము సుమామోదమేదురము లై సుఖముల్. ౨౮

శా. గాంధర్వాభినయప్రవీణమతు లౌ గాణిక్యమాణిక్యముల్
మంథానాచలనూతనోపచితరంభాముఖ్యదివ్యాంగనా
గంధాఘ్రాణచణానుభావ మొలయం గై సేసి యిచ్చోట సం
బంధు ల్సిద్ధులుగాఁ బ్రకాసిలెడు నిర్మాణం బనూనంబుగన్. ౨౯

గీ. ఏమి దోహదకలనలో? మెఱుఁగరావు
పూర్తిగాఁ బూచె సర్వర్తుపుష్పజాతు
లాగ్ర మాస్కంధ మెప్పుడు నలరుగముల
నలరుచున్నవి యీగమము లఖిలములు. ౩౦

మ. మతి రంజిల్లఁగ నిట్టిచోటఁ గవుల న్మానింపఁగాఁ జెల్లుఁ బో
ప్రతిభాంకూరము లల్ల నిప్పుడె సహస్రగ్రంథము ల్గావె? యు
ద్ధతిఁ బర్వెత్తు మనస్తురంగమము నూదం బట్టఁ బగ్గాలు లే
వతిభావంబులు నాయకుండు రసికుం డౌ నేని మా భాగ్యముల్. ౩౧

మ. అదె సౌరాంగనలో? ఫణీంద్రవరకన్యారత్నసంఘంబులో?
మదమత్తేభవిలాసయానముల సంభావించి రుల్లోకసం
పద మీఱం గుసుమాపచాయవిధి తద్భావక్రియావ్యగ్రమన్
మదియున్ వీనులు గన్నులుం దనియ సంధానించి యం చున్నెడన్.

పుష్పాపచయము

వ. చెలీ! యీ చెంగలువ లెంత హంగుగ నున్నవే? యనంగుని మచ్చు మందుబరిణె లనవచ్చు. ఈ యొడ్డున నుండి మెల్లగా నందికొనుము. గౌరీ! పాటలులపై నెంతవలపే? నీకు. భావముతోఁ గూడ దేవి ననుకరించుచుంటివి. శ్రీమతీ! శ్రీమంతుల నెమకికొనుచు నెంత దూర మరిగెదవు? జాత్యభిమాన మున్న నీ జాతులఁ గొనరాదా? విశోకా! యశోకములచాలున సంచరింపుదము. సరసా! యది మారుని సృష్టి కగు రాగరసప్రవాహము. అగాధము. సుమచాపు నారులు కేఁగెనా? తారుమారు సేయకుండవు. భీరూ! నారులము కామా? మనము మాత్రము. ధీరుల నవి నిజముగ జంకింపనేరవు.

దారుకా! యొడినిండ నగ్నిశిఖల నించుకొనెద వేమి? చాలు. చల్లని యీ మల్లెపొదలలో విహరింపుము. కమలగంధీ! సొంపైన యీ చంపకములు మఱి యిన్ని సంపాదింపుము. పైఁబడు నిమ్మధుపాళి నొక యంతయుఁ దగ్గిపోఁ గలదు. సహాసా! యీ సహకారముల నమ్ముకొనకు మనె కమ్మని శుకమ్ముల వచనమ్ముల శైలికి లంచ మిచ్చుచు దానిమ్మలు జనమ్ముల మనమ్ము లాచికొనుచున్నవి. ప్రమదా! స్ఫాటికశిలాతలమ్ము చేఁసాచి వెదకెద వేమి? ప్రతిబింబించిన యుడుకుసుమంబు లివి. భామినీ! యల పలాశిగణము దరియకుము. నాగడఁదగు నీ పొగడల నలముకొనుము. పల్లవపాణీ! మరువము మాని దమనము సంగ్రహించితివా? యీ వట్టివేరుల చేరువఁ దారామటలతోనే సరియా? పన్నగవేణీ? పున్నాగముల సంగ్రహింపుము. రాగవతీ! చేతిలోఁ జిక్కిన పున్నాగము లెందుఁ బోఁ గలవు? సఖులారా! యీసూనములు చాలు. పదుఁడు. సమయ మతిక్రమించుచున్న దనుచు నన్నెలఁతలు లతలనుండి ప్రసవమ్ములఁ దెచ్చి నచ్చెలియిదమునకు విడలేక వెంటనంటిన తుమ్మెదపిల్లల యల్లరు లనఁదగు కడగంటిచూపుల యొయ్యారములఁ గడలంట నెఱపుచు క్షణములో నల మంటపముచుట్టుం జేరిరి. తత్కాలమునకు న్యగ్రుకంటఁ బడని మదనుఁడో? చెట్లపాలు గాని మాధవుఁడో? యంకము డాచిన శశాంకుఁడో? నా నొక్కపురుషోత్తముఁ డందలి రత్నాసనమ్ము నలంకరించెను. వానియంగనె ష్ఠవమున కనంగుఁడు సిగ్గువడి యొడలు విడిచి నాము చేయుచున్నాఁడేమో? పసివాఁడా జయంతుఁడు కుబేరుని కొడుకు నలకూబరుఁ డుదురు. వాని వలచిన రంభం గింభ యనకుందురా? నారాయణుఁడు కదా మాధవుఁడు? పోల్పరానివాఁడే యీ భూమికలో సమాధవుఁడు. తేజము మున్ను విమాయుఁ నేయు వేసం బిప్పుడు మాయావి యనియుఁ జెప్పుచునే యున్నవి. సాముద్రికశాస్త్రమున నుత్తమపురుషాకృతివర్ణనంబు చదివినవారికి నవి చదువానివారికి కవివర్ణన లెక్కవు. ఆకృతియందే గుణము

లుండును. స్వభావము లవు భావములు రసికుల యూహల కెఱుఁగ రానివా? చతురలంకారము లతనిఁ జెంది చతురాలంకారము లయ్యె. మనమున నుదారత లేనివాని కర్థ మందలి యాధిక్య మెట్లును దోఁపద. అట్టివారికొఱకా? కవుల ప్రయాసము. గాయకుల తేట గీతులతో నాటవెలఁదుల సయ్యాటలు సాగ నాశుకవితలతోఁ గవు లాస్థాన మాక్రమించిరి. వీణలకు వేణువులు సవర్ణములే కదా. మృదంగముల యొయారపు నడల కనుగుణము లయ్యె మృదంగము లెట్లయ్యెనో? శాబ్దికుల నడుగవలయును. "కామకలాశాల" యని యచ్చోటా యుత్సవంబునం బేర్కొనం బడియె. నప్పుడు— 33

శా. సుస్నాతం బవు మేనఁ బూత లొలయన్ శోభిల్లు హారంబు భా
వస్నిగ్ధం బయి లోకమాచికొన దివ్యక్షౌమముం దాల్చి సా
ధస్నుప్రాంతమునుండి యొక్కకొమ చంద్రజ్యోత్స్న నా వచ్చె నా
స్థాస్నుద్యోతతటిల్లతావిభవసందర్భస్ఫురన్మూర్తి యై. 34

గీ. క్రమధూపిత మై కుంచెగట్టి నట్టు
లవటుభాగంబునం బన్ని యారవిడిచి
నట్టి కైశ్యమ్ము చామరాయతవిభూతిఁ
బ్రచ్చి పంచాశుగానలు రవులఁజేయ. 35

క. పూజాపరికరములు దా
సీజనములు గొనుచురా విశేషవిభూతిన్
స్త్రీజాతిరత్న మది వి
భ్రాజితవిభవుఁ డవు విభుని పరిసరమందున్. 36

గీ. చేరి యింద్రుఁ బులోమజచెలువు మెఱయ
నాదరించెఁ గవీంద్రకావ్యప్రసక్తి
నట్లు తిలకించె గణికాజనాభినయము
నందు గాయకసంగీత మాలకించె. 37

గీ. అంత నొక్క పురోహితుం డచటఁ జేరి
సంతసంబునఁ బలికె నా శ్యామతోడఁ

దరుణి! యాలస్య మేల? యుత్సవ మొనర్ప
నభిమతంబుగ సంకల్ప మాచరింపు. ౩౮

## మ ద నా ర్చ న ము

చ. నయనము లంగజన్మునకు నాతిరో! వీరు "మధుశ్చ మాధవ
శ్చ"యని వచించె నా శ్రుతి యసంశయవృత్తి ద్విధాత్మ లౌట మా
లయపవనుండు రాతిరి కలానిధి సాయుధశక్తివాహన
ప్రియపరివారవారముగ వీరలు పూజ్యులు మీనలోచనా! ౩౯

గీ. అదె యమర్చితి వేదికాభ్యంతరమున
మంటపములు యథాస్థానమానితముగ
వీరిఁ బూజింప మెచ్చుఁ బూవిలుతుఁ డతివ!
యంగసంస్తుతియుఁ బరార్థ మగుటవలన. ౪౦

ఆ. అనుచు విప్రవర్యుఁ డా యా విధానంబు
లాచరింపఁ జేసె నతివచేతఁ
గవివరేణ్యు లచటి కార్యక్రమం బెల్ల
సన్నుతించి రోలి సంగ్రహించి. ౪౧

చ. లలితము లైన పూవుల "గలానిధయే క్షణదాయుతాయ" యం
చలికులవేణి పూజనము లాదృతిఁ జల్పుచునున్న దివ్యోడ్క్
గలుషము లెల్లఁ బాచి జనకాంక్షితదర్శనుఁ డైన యా సుధా
విలసితమూర్తి దాల్చు నుడువిస్తృతితో నదసీయభవ్యముక్. ౪౨

ఉ. ఇందుధరుండు నెత్తిపయి కెత్తిన గౌరవ మెక్కుడైన గో
విందుని బాంధవంబు ననవిల్తుని మాతులుఁ డౌట గూర్చె నీ
ముందరఁ బూజసేయఁదగు పున్నెము బున్నమచందమామ కా
నందకరత్వ మన్న జననంబునఁ గొన్న విశేష మారయక్. ౪౩

క. వెన్నెలకు నిశకుఁ దారల
కన్నియతిం బూజసేసి యలికచ నెలలో

నున్న కురగంబున కని
సన్నుతదూర్వాంకురం బొసంగెం బ్రీతిన్. ౪౪

ఉ. స్వాగతమేకదా? మలయశైలసమాగత! బంధురత్న! పౌ
ష్పాగరుగంధబంధుర! మహాబల! యింకిటఁ గట్టివేయుమా
ద్రాఘుపయానసాలసకురంగతురంగము నంచు నెంచు చ
భాగ్యతు నట్టు లప్పవను నంగన గొల్చె ననంగుపాత్రితోన్. ౪౫

సీ. పుష్పాంజలి ఘటింతుఁ బుష్పేషుచాపమా!
యళిపాళిగుణమ! మద్య మదె గొనుము
దానిమ్మగింజ లింద మనంగవాహమా!
పైకమ్మ! యివె మామిపసిచిగురులు
మానసం బొసఁగెద మకరాంకు మీనమా!
సుమజాలమా! శిరసున ధరింతు
నాత్మార్పణప్రౌఢి నర్చింతు నామనీ!
రతిదేవి! నీకు నారతు లమరుతు
ననుచుఁ గాముని బలగమ్ము నంబుజాక్షి
సఖులతోఁగూడి పూజించి సంస్తవించె
వరుసతో నౌర తంత్ర మెంత రమణీయ
తర? మొలసెఁబొమ్ము కంతుసంతర్పణమ్ము. ౪౬

క. ఇవ్విధము నుత్సవమ్మున
మవ్వము చిత్తమ్ము దివ్య మహితలలిత మై
యవ్వనిత యానతిచ్చెం
బువ్వము బంతు లొనగూర్పఁ బూఁబోఁడులకున్. ౪౭

మ. చెలువొప్పం గొమ "యోం నమో భగవతే శ్రీకామదేవాయ" యం
చల రత్నాసనసన్నివిష్టు విభుఁ గామాభిన్నతాభావనం
గొలువంజొచ్చె నయారె యారచితవాగ్గుంభంబుతోఁ బూలదో
యిలిఁ దత్పాదసరోజయుగ్మము ఘుమాయింప న్సమర్పించుచున్. ౪౮

సీ. ద్రావణబాణమంత్రప్రసాధిత మార్య!
యరవింద మొసఁగెద నాదరింపు
సందీపనాస్త్రబీజన్యాసకలిత మ
శోక మిచ్చెద దేవ! స్వీకరింపు
సంమోహనశరానుషంగరుచిర మైన
చూత మర్పింతు సంస్తుత! వహింపు
సంతాపనేష్వస్త్రసమభిమంత్రిత మీశ!
నవమాలికం గూర్తు నవధరింపు
మిదె వశీకరణాస్త్రసమీహితం బ
నఘ! కైకొనుమయ్య నీలోత్పలంబు
పంచసుమబాణ! పాలింపు భార మూని
మము సమానులలో ననుత్తములఁ జేసి. ౭౯

గీ. అని యనేకవిధాల మంత్రార్థ మెల్లఁ
దంత్రముగఁ జేసి పూజించెఁ దలిరుఁబోఁడి
భావనాద్వైతసిద్ధితోఁ బతికిఁ గుసుమ
సాయకున కభేదాధ్యవసాయ మమర. ౮౦

గీ. శాస్త్రమున నున్న మాదిరి జరుపఁగలరె?
దీని నొక్కవిశేషంబు తేటపడియెఁ
బురుషునిపై మాట యేనాఁడుఁ బూవుఁబోఁడి
యతులాతీతుఁ గానీయ దాత్మవిభుని. ౮౧

గీ. తెలుపఁ దీయుము కవిమాయ! తాళఁజాల
నన్ను నొప్పకు మాయావి! నమ్మఁజాల
ననుచు ననుచు చెలు ల్సీర నతఁడు నదియు
నామధేయమ్ము లను జెప్పి రేమహాముని. ౮౨

గీ. అద్భుత మ్మక్రమ స్మారమహామహామునఁ
దేటి తేర మొక్కఁ దుపన్యసింపఁ దొడఁగె

నాలకింతుము గాక స్మరానుశాస్తి
ననుచుఁ గవు లూరకున్న ని ట్లనిరొఁ జిలుక. ౫౩

మ. జనులారా! వినుఁ డాదరం బెసఁగ నస్మత్స్వామియాజ్ఞాపనం
బనుకూలత్వము మేలు దంపతుల కత్యాజ్యంబు మద్యంబు వో
యిన భోగార్హవయోవిలాసములు రానేరావు రమ్మన్నఁ బో
లినకార్యంబులఁ జక్క బెట్టుకొనవల్దే? దీప మున్నంతలోఁ. ౫౪

గీ. ఏల యభిమానపంకంబు? లెడపడకుఁడు
స్త్రీపురుషులార! పగలు త్యజింపవలయు
నర్థకామములే పురుషార్థము లన
ధర్మ మనఁగఁ దన్నిర్వాహదశయ చుండి. ౫౫

రస శాబల్యము

ఉ. ఈ రహిఁ జిల్క వల్క నెడ ని య్యల శాశ్వతమే? యటంచు సం
సార మసార మంచు వరుస ల్మొరసెం దగ మర్దలంబునం
దారమణీయయోగుని మనోంబుజ మల్లలనాడె నింతలోఁ
జారువిలోచనార్పితవిశాలబహూకృతు లిచ్చ మెచ్చుచున్. ౫౬

గీ. సాగిపోఁజొచ్చి రల్ల వేశ్యలు నటు లటు
లెల్ల మేళంబులుం బోయె నేగిరి కవు
లాదరంబున నొసఁగు గద్యాణశతము
నందుకొనక మార్దంగికుఁ డనియె నిట్లు. ౫౭

గీ. పద్మలోచన! ధనముతో బాంధవంబు
నిలువఁబోవదు పరిచయనియతిఁ గోరి
మీాదరిం జేరితిని నన్ను మెచ్చితేని
నాదరంబున స్వీయుఁగా నరసికొనుఁడు. ౫౮

క. వైదేశికుండ రసికస
మాదరమున మెలఁగుదున్ లతాంగీ! విద్యా

ప్రాదుర్భావముకొఱకే
నాదేశిను నెమకుచుంటి నలినదలాక్షీ! ౬౯

ఉ. వచ్చుచుఁ బోవుచుండెదను వారిజలోచన! భృత్యవృత్తితో
నిచ్చకు వచ్చినట్టులు వహించెదఁ గార్యముభార మెల్ల న
న్మెచ్చిన భోజనం బిడుట మేలు మహార్థము లేల? వీడుకో
లిచ్చినఁ బోయివచ్చెదన యిప్పటికి న్సుఖముండు ముగ్ధలీ! ౭౦

క. నీనాథుమనసు వడయుట
నూ నా పరమార్థ మెల్ల సుదతీ! యనుచున్
బోనేపోయెను దగ వాఁ
డానాఁటికి గోమ సుఖంబున నా రే గడపెన్. ౭౧

గీ. అంక మంగంబుఁ జరితంబు నలముకొనఁగఁ
బ్రీతి నెనసిన ద్విజరాజు వెల్లనయ్యె
సత్పథంబున విచరించు జతన మూది
యిల నితోదయుఁడయ్యెఁ బ్రదయీతనుండు. ౭౨

గీ. తమము విరియింప లోకబాంధవుఁడు దోఁప
ధనమదాంధులు జారులు దస్కరులును
గాని జగమెల్ల నొగి మేలు కాంచె
విభవ మాసించువా ర్దివాభీతులైరి. ౭౩

శా. సన్యాసిం గృహిఁ జేయు నాగృహి వెస న్సన్యాసిఁ గాఁ జేయుఁ గా
వ్యన్యాయమ్మునఁ గాలకర్మము లిఁ కే వా రేమి సేయంగలా
రన్యాగోచరనై భవంబున విధుం డా రీతి భాసిల్లి యా
మిన్యంతంబున హంసమూర్తి దఱుమన్ బెగ్గిల్లి పోఁబాఱెడున్. ౭౪

గీ. అంత నైభవ మెనసిన యబ్జుఁ డోడుఁగ
నపుడు పొడసూపి ఖద్యోతుఁ డతిశయించె
భువిఁ గనమొ ముందు వచ్చిన చెవులకన్న
కానక వచ్చిన కొమ్ముల నెగడఁజేసెను.

మ. శ్రుతియుక్తి స్న నుఁ జెందియున్న వెలుఁగుల్ శోధించి మోదింపుఁ డం
చతిలోకం బవు నాత్మరూపమున విద్యాబోధముం జేయు త్వ
త్ప్రతి మాయించు నుపాయము ల్నెడ విధిం బల్మారు నిందించుచున్
సితభానుం డరియాడు చిత్తమున గాసిల్లెం గడుం బేద యై. ౬౬

గీ. చాలి జలజములకుఁ దెల్వి సంతరించి
యడరు నజ్ఞానతిమిరంబు నపహరించి
మింట మంటను దన తేజు మేల్మి నెఱయ
భానుఁ డెనసె జీవన్ముక్తు వైభవంబు. ౬౭

గీ. చెన్నకేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహి సమర్పిత మైన యామావిశఁ గృతి
ప్రచిత మైనది మూఁడవు ప్రకరణ మిది. ౬౮

గీ. తాడెపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిటు. ౬౯

శ్రీ శివాయ గురవే నమః

# యా మా వి క

## చతుర్థ ప్రకరణము

శా. ఆజ్ఞాచక్రము నేలు ప్రాభవముతో నా శాపశువ్రాతముం
విజ్ఞానాగ్నికి హవ్యముం సలిపి సంవిద్యజ్ఞనిర్వాహకుం
హై జ్ఞేయాత్మత మించు సాధకుని విద్యన్సత్యసంకల్పు స
ర్వజ్ఞుం జేసి కృతార్థుఁ జేయు గురు నిర్వర్ణింతు నీశానునిన్.

* * *

క. శ్రీవివశ! చెన్నకేశవ
దేవేశ! స్వసన్నివేశదేశాధీశా!
భావయితృభవ్యదృక్సం
భావితవిశ్వేశ! విశ్వపరపరమేశా!

వ. ఆకర్ణింపు మీ యగాధగాథావాహిని నా మహితుఁ డస్మదాదులకు బోధించిన వచువున. ఒక్కనాఁ డొక్క రమ్యహర్మ్యాగ్రంబునఁ జెవులు దోరలువాఱ సదస్యు లాభిముఖ్యంబున విన నొకగృహస్థు నాస్థానంబున బోధకునుం డొకొండు సంగీతసాహిత్యంబు లేకరసం బొనరించి తత్సారస్యంబును దన భక్త్యావేశం బోరులకుఁ బంచియిచ్చుచు భగవత్కథాసంలాపంబునఁ గాలక్షేపం బొనరించుచుండె. తదర్థంబు సంగ్రహించి వివరించెద —— ఆర్యులారా! పురాణములకు హరికథలకు వేడుకపడివచ్చువార లనేకులు. సారగ్రహణతత్పరులు కొందఱు మాత్రమే. పౌరాణికు వేసమునకు సంతసించువారు, శ్రోతలయన్యోన్యసంగతికి మెచ్చువారు, పాత్రము సంపుటము నింపుఁ బొగడువారు, దానికిఁ గట్టిన దారము మేల్మికిఁ జొక్కువారు, నర్థవాదములఁ గొని

యాత్మాభీప్సితము సాధింపనెంచువారు, సంగీతము తలత్రిప్పుడు నాద రించువారు, సాహిత్యము రసాభాసము మే లనువారు నింక ననేకు లనేకవిధముల వార లై యుందురు. ఇవి యన్నియు శ్రవణప్రయోజ నములు కావు. శిష్ట చెప్పిన విధమ్మున నుత్తముల చరితములలోని మంచిపనులు మన మాచరింప నెంచవలయును. వార లొనరించిన కార్యములలో నస్మదాదుల బుద్ధులకు గోచరము గాని కారణము గల ధర్మవిరుద్ధముగ నాభాసించు వాని మన మాచరింపరాదు. వాని నిందించు నంతటివారము కాము. కాన నీతత్త్వంబు మనమున నిడి యాదరంబున నా వినుచు మాహాత్మ్యములు విని సారగ్రాహు లయ్యె దరు గాక యని ప్రార్థించుచుఁ బ్రకృత మనుసరించెద. సావధానుల రగుఁడు. ౨

హరికథోపక్రమము

శా. ఆశీతాంశుఖరాంశుతారము నమర్త్యగ్రావమాత్సర్యసం
వేశాసీశత నాక్రమించిన మహావింధ్యాద్రి లేశంబు ని
శ్లేశత్వం బెనయించి యాశుదయ వార్ధిగ్రామపానక్రియా
భ్యాశోదంచితకీర్తిపూర్తి యగు మాన్యాగ్రేసరుం డొక్కఁడే. 3

మహాస్రగ్ధర. ఘనశక్తిప్రాణితాశాగణవిహితవిభాగల్లఁ గొల్లాపురీల
క్ష్మిని వేదాన్తప్రసిద్ధాఖిలవచనలసత్కీర్తిఁ గీర్తించి యాడే
వినియుక్తిన్ వ్యామలభ్యావిరలకుచకచ ల్భిల్లపల్లీపురంధ్రు
ల్లోనియాడ న్భార్యతోడం గొనకొని చనియెన్ గోధ్వజు న్దేవుఁ గొల్వన్

శా. ఆగోరాజతురంగగామిఁ గని నిత్యాసందుఁ డా మౌని స
ర్వాగోధ్వంసక! నీ ప్రభావ మసదే? యం చాత్మలో నెంచి య
ర్వాగానద్ధదిగంతరాళతపనప్రాంశూగ్రసంతాపసం
యోగం బప్పటి మార్గ మాఁగఁగ ననున్ యోషిల్లలామంబుతోన్.

ఉ. ఆగమనాధ్యమానచరితామృతరమ్యము తుంగభద్ర నా
సాగరురాణివాస మిది చానరొ! రాజతనూజవుం దప

క్రౌంచనగాసేయ వంచు నిను జేర సమీరకుమారుఁ బంచె నూ
ష్మాగమనోపతాప మెడయం దొడితె మ్మని సంభ్రమమ్ముతోన్.

వ. అని యక్కైలాసపతి పావవిశేషంబు సంభావించుభావస్ఫూరితో భక్తి
మూర్తిభజించినట్లు సానుచరుండై సమీపించి యయ్యాపగాపురోగమ
ముద్దేశించి. ౭

క. ఊర్మ్ము లిరుమూఁడు వెరసిన
ధర్మేతర మా జనంబు దగఁ జిత్ర మనం
బోర్మ్ములతోడ నిజేశ్వరు
కూర్మి సమర్థింతు వీ వకూపారసతీ! ౮

ఉ. చిన్నని తుంపురు ల్వొరయ శీతల మై తరుషండమంద మై
క్రొన్నన తావు లూది గిరికోన్న సమీరము చేత బాహ్యముల్
బన్నము లెల్లఁ బాపె దటు భవ్యకటాక్షపరంపరాప్తి నా
పన్నుల యాంతరంగికవిపత్తతి మాన్చెద వబ్ధిభావినీ! ౯

క. అని సన్నుతించి యాతం
డనువ్రతయు శిష్యులును యథాగమముగ నా
మనికిఁ గృతకృత్యు లయి నె
మ్మనము లలర నచటు వాసి మానితవృత్తిన్. ౧౦

మ. చని శూలాయుధహస్తు దేవమణి నుత్స్నానాంబునం బూజ సే
సి నితాంతోజ్జ్వలభక్తి స్వామికుధరోత్సేధంబుఁ ద్రొపించి క
న్గొని రందు న్శిఖివాహు నిర్మితనతైనోదాహు రక్షోంగనా
స్తనపత్త్రాంకురహారిభూరిశరభాస్వద్బాహుసాఖ్యావహున్. ౧౧

సీ. పుట్టినప్పుడ భూరిపుణ్యోదయ మ్మయ్యె
శరవణమ్మున కుపాస్యత నెనయుటఁ
దల యెత్తినప్పుడ తల యెత్తె సురల చే
తోవృత్తి నరుల గెల్తు మను వీఁక
పారాడినప్పుడ పౌరందరేందిర
మునుమేన మొలకజవ్వనము వ్రూనె

నిలిచినప్పుడ నిల్వునీరయ్యెఁ దారకా
ద్యమరారిఘనహృదయాశ్మపాళి
పురుడు తీరనినాఁడ యభ్యుదయ మొనసి
పురుడు లే దన నీవు సంపూర్ణశక్తి
దైవతసపత్ననగరుల దండు విడిసి
నపుడ భువనము లలరె మహానుభావ! ౧౨

ం. నిహతారిప్రచయప్రసక్తి ఘన యా నీ శక్తి నీ వాహనం
బహిలోకానుహృదగ్రగణ్య మిఁక నీ యర్ధాంగ మింద్రారిల
క్ష్మ్యహితాపాదక మిట్టి నీ దయ నిరీక్ష్యం బన్న వేయేల? నో
బహులాపత్యమ! భుక్తిముక్తిదుఁ డిలం ద్వద్భిన్నుఁ డొం డుండునే?

ం. అని యద్దేవు నుతించి తత్ప్రకృతమర్యాదాప్తిఁ గూర్చుండి య
మ్మని తత్త్యమునీంద్రలోకమున కామోదంబు సంధిల్ల నా
తని వాగ్ధోరణి యంతయు న్విని యనేక ధన్యత్వముం జెందె మ
జ్జని త్వన్నిర్మిత మీ పురాణము వినన్ స్కందా! మహానందదా!

. క్రౌంచదారణ! నీ యీ పురాణమందు
క్షేత్రమూర్తిప్రభావముల్ కేవలములు
తీర్థమహిమలు వినఁబడెఁ దీపు పుట్ట
నింక నీ మాటి మే ల్లన్న యిక్కఁ జెపుమ. ౧౫

స. అనుడుం గాశిక మెచ్చి శ్రీశిఖరి మాహాత్మ్యంబుఁ గీర్తించి మే
ల్గాని సేతుస్థల ముగ్గడించి మది నాలోచించి యీ యర్థముల్
విన నాకుం గుతుకంబు గల్గె జనకు న్విశ్వేశు సాంబుం గనన్
జన రండీ యని వారిఁ దోడుకొని భాస్వద్వాహనారూఢు డై. ౧౬

. మార్గము గ్రమించి కాంచి నమస్కరించి
మించు నేడ్కఁ నధిష్ఠించె మృడతనూజుఁ
డాశ్రితైనోపహారనిత్యవ్రతంబు
రజతభూభృదధిత్యకాగ్రస్థలంబు. ౧౭

ఉ. ఆ రమణీయ యచ్చటఁ దనంతన మెల్లన లేచి తత్ప్రతీ
హారము దాఁటి పేరురము హారముల న్నవరించి మంచి చో
క్కారము మీఱు నచ్చటి నగర్యధివీధుల సౌధసత్ప్రతీ
వారము నమ్రమై కొలువ వంచిన ముందలతోన వోవుచుః. ౨౯

చ. కలితఫలప్రసూననవకల్పక శాఖిమనోహరంబు మం
జులతరగోపురాంతరవిశోభితహర్మ్య మొకండు గాంచి య
ప్పొలఁతి కడంగి ద్వాస్థజనపూజిత యై యిరుమూఁడు నొండు క
క్ష్యలు నొగి దాఁటి యచ్చటి గవాక్షమునం జెవి యొగ్గి యొత్తిలెః.

క. ఆలోపలఁ బవళించె వి
శాలమసృణసోపధానశయ్యాస్థలి నా
నీలమృదుదేహుఁ డొకఁ డా
భీలచతుర్భుజుఁడు వినతబృందారకుఁడై. 3౧

ఉ. ఆనతదేహుఁ డౌచుఁ జతురాననుఁ డా మహనీయుమోమునం
దా నిజదృష్టిఁ జొన్పి వినుతంబుగ ని ట్లని విన్నవించె దే
వా! నమదార్తిసంచయహరా! యవధారు విదారితాఘుఁ డా
మానివరుం డొకొండు నిను మానసమం దిడి సంతపించెడిః. 3౨

ఆ. పుండరీకనయన! పుండరీకుం డను
పేరివాఁడు నిన్ను కోరినాఁడు
గేరినాఁడు కామచారివృత్తము లెల్ల
మీఱినాఁడు నియమి మితుల వాఁడు. 33

సీ. కన్నాభి లోనుండి కలఁచెడు కామాది
విమతవర్గము మున్నె వినత మయ్యె
వైరాగ్యముఖసహకారివర్గముతోడఁ
దివిరి వివేకం బుదీర్ణమయ్యె
నలసచిత్తులపాలి యమదూత యవు కర్మ
విధి వాని సేవతో వివశ మయ్యె

జీవనాథుఁడు వంప తీవితో నరిగిన
రంభ నిరర్థకారంభ యయ్యెఁ
గలుష మణు వయ్యెఁ బున్నెంబు గనె మహత్త్వ
మతఁడె గురు వయ్యె లఘు వయ్యె నఖిలజగతి
కలితయోగప్రసక్తిఁ బ్రకామత గను
వశికి నీశత యిడుట నీ వశమ యింక. 34

క. ఆతని తపమున కినుఁడు ని
రాతపుఁ డగుచుండ జగము సాతప మయ్యెన్
నాతరము మిఱిలె నింతకు
నీతలఁపునఁ బెట్టి యెట్టి నేరిఁ జూచెదవో? 35

మ. అనుచుండన్ దరహాసచంద్రికలు పర్యంతంబునం బర్వ లే
చిన యద్దేవుని మోసలం జనియె నీ సీమంతినీరత్న మా
యనఘుం డాయమ నాదరించి తన తల్పాభోగముం జేర్చి య
ల్లన చేఁజే సవరించి ముంగురులు లీలాలాలితోత్సాహుఁ డై. 36

క. అక్కా! కుశలమె? యని త
న్నొక్క లతాతన్వి యడుగ నో మని విభునిం
జక్కఁ గనుంగొన నాథుం
డక్కలికిం గారవించు నక్కాలమునన్. 37

ఆ. ధ్యేయరూపుఁ డయ్యె దేవతాజ్యేష్ఠుండు
నచటివార లెల్ల నటు నిటు చని
రంతఁ గొంతతడవు చింతాకులాంగి యై
కాంత పల్కఁదొడఁగెఁ గొంతుతోడ. 38

శా. నాథా! ఏమని విన్నవింతు భవదాజ్ఞన్ భూతసంఘంబు ని
ర్బాధం బై మను నెల్లవారల యభిప్రాయంబు నీయంద యు
ద్బోధం బొందు నిరంతరంబుఁ బునరుక్తం బ్లావె? నా పల్కు లం
చాధిం జెందియు నూరకుందు నెటు నీ వాలింపకే యున్నచోన్.

శా. నా కాధారమ మైన భోగిపతికన్నన్ విశ్వము ల్లాల్చు నా
నీకన్నన్ దిగిభాళికన్నను మదాంధీభూతుల న్మోవఁగా
నాకే భార మనంగ నయ్యెడు జగన్నాథా! కృపాదృష్టిచే
నీ కష్టం బెడబాపవే తలఁపవే యిల్లాలిసౌకర్యమున్. ౪౦

ఉ. ఏమి భరంబు వారినిధు లేదు ధరించినఁ గష్ట మున్నదే?
భూమిధరప్రతానములఁ బూనిన నొక్కని దుష్టు నక్కటా
యేమెయి మోవవచ్చు నల హీను లనేకులు మేర మీఱినన్
బాములు వెట్టఁ జూడఁ దగవా? తగువారలలో రమాధవా! ౪౧

సీ. బావను సోదరిన్ బందాల నొనరించి
రాజ్యం బొనర్చు దుర్జాతుఁ డొకఁడు
శైవార్చనకుఁ గా బహుళరాజన్యబృం
దము సమయించు దుర్నయుఁ డొకండు
గగనచరం బగు నగర ముపార్జించి
జగము గలంచు దుశ్చరితుఁ డొకఁడు
వేయిచేతుల బల్మి విఱ్ఱవీఁగుచు నీశు
నాజికిఁ బిలుచు దురాత్ముఁ డొకఁడు
కొండ అధికులు సదృశులు కొంద అసము
లెందఱో? వారు వీ రని యెన్న రాదు
వేఁచుచున్నారు కడఁగంటఁ జూచి సుంత
నాదు కడగండ్లఁ బాపవే? నందకధర! ౪౨

ఉ. ఏ నిటు లంటి నంచు మది నీరస మూనకు మింతలోన నీ
యాన సుమీ మునింగెద మహాంబుధిఁ బ్రోవక తక్కితే నటం
చా నవలా వినీలనయనాంబుకణుల్చనుదోయి జాఱి పెం
పూన శిరంబు వంపఁ బురుషోత్తముఁ డాతఁడు సానుకంపుఁ డై. ౪౩

మ. లలనా! న న్గను మింతగా వగవ నేలా నీకు? నీ యిచ్చ రం
జిల వర్తింపనె యంచుఁ గన్నుఁగవఁ బై చేలంబుతో నద్ది యా

చెలువం జెంగటఁ జేర్చి పల్కుల రుచిం జిత్తమ్ము సమ్మోదని
ర్మల వారాంనిధి నోలలాడు నెరి సంభావించుచున్నంతలోఁ. ౪౪

ఆ. నడిమిజగమునఁ జల్లదనంబు నింప
విధుఁడు విహితోదయుం డవు విధము దోఁప
నరుల నిరులను సమయించు నతఁడె మన ప్ర
తాపము లేఁకేల యని యేమొ? తపనుఁ డరిగె. ౪౫

గీ. రాజు తేజంబు దనదు గర్భమునఁ దాల్చి
మెల్లమెల్లన ప్రాగ్దివి మెఱుఁగు గాంచెఁ
గాని వారల మోములు మ్లానము లగు
నంతఁ దనవారి కన్దోవ లందగించె. ౪౬

క. అత్తటి నా యుత్తముఁ డా
బిత్తరి నెలయించి పంచి వేసం బెసఁగం
జిత్తము క్రొత్తగ బులుగుం
దత్తడి పై నెక్కి వెడలి దరహాసముతోఁ. ౪౭

మ. ప్రతిహారస్థలి వెంటనంటు పరివారం బాఁగి శ్రీదేవి స
మ్మతి నిచ్ఛాగతి నేగుచో దెసలు నైర్మల్యంబునం బొల్చె మా
రుతము ల్మెల్లగఁ జల్ల నై వాలిచె సంరోహించె స్వచ్ఛాదుల
స్మితముఖ్యగ్రహసంచయంబు భువనౌచిత్యానుకూలంబుగన్. ౪౮

సీ. దయచేయుమయ్య నీ దాసుండ నిం దున్న
వాఁడ నీకొఱకు సర్వమ్ము వదలి
కై సేయరాదె? నీ కై శోరకంబున
భవశోతార్దితము మత్స్వాంతతలము
నేలుకోవచ్చు నీ మేలంబ కోరెదు
నన్ను నావారి నీ నాఁటి కరుణఁ
బాలింపవలయు నీపరి దైనఁ గాకున్న
మే నుండఁబో దింతమీఁద వరద!

యనుచు మునిసిద్ధసాధ్యు లత్యంతభక్తి
జగదధీశ్వరు సంచారసరణి మ్రోసి
రాలకించియు "నిద మిత్థ" మనక పోయె
నాఁటి కెగ్గెడ గుఱిపెట్టినాఁడొ? వాఁడు. ౪౯

ఉ. ఎవ్వఁడు మూఁడు లోకముల కెక్కుడుగాఁ దప మాచరించెనో?
మవ్వము మీఱ నంచు గరిమంబున విచ్చిన పారిజాతపుం
బువ్వులఁ గూర్చి వేలుపులు పుష్కరసీమన నిల్చి చూడ దా
దవ్వుల నొండు దీనవిరుతంబు వినంబడె నబ్బురంబుగన్. ౫౦

సీ. దిక్కు లేదొక్కొండు దీనావనోద్యోగ!
చెఱసాలయందు మా మొఱ వినంగ
సుప్రాప్తమయ్యెఁ బ్రసూతికాలం బిప్పు
డస్వతంత్రుల మిఁక కే యండ లేదు
పూర్వజన్మమునందుఁ బున్నె మే సేయమో?
పాప మొండెఁ ఫలించు వడువు గనెనొ?
దంపతుల్ లేరొ? సంతతి గల్గదో యిట్టి
నిర్బంధ మున్న దే? నియతి కాక
యేల రా వేల? జా గేల? చాలి మేలు
గూర్పవే నిన్నుఁ దక్కఁ గన్గొన మొకండు
తెరువు దరిఁ జేర్పవే వడఁ దీర్చి లోక
మాన్య! వైకుంఠనాథ! రమాసనాథ! ౫౧

ఉ. కష్టముమాట యాకసముకై వినరాఁ గత మేమి? యంత కా
దుష్టుఁడు సోదరిం గెడపఁ దోఁకొని నేమిటి? కి ట్లపత్యపూర్ణ
నష్టమువంకఁ దోఁచు వృజినంబున కే మిర వైతి మక్కటా!
యష్టమగర్భ మయ్యది యథార్థము నీవ యెఱుంగు దీశ్వరా! ౫౨

క. ఏది యెటు లున్న నిప్పటి
కేదరియో చూపు మీ యనీశుల కీశా!

నీ దయ కసాధ్య మున్నదే?
కాదన్నం బోదు తడవు కా రాదు హరీ! ౫౩

క. అను నెలుఁగు వీనుదోయిఁ
ఘన మై చొఱఁబాఱి మదికిఁ గనుకని గూర్పఁ
వినతాసుతు ననిచి చనె
న్వనజోదరుఁ డాతఁ డా మనస్వులకడకుఁ. ౫౪

వ. ఇత్తెఱంగున నరుదెంచి య చ్చిరపుణ్యులఁ గాంచి యరు దెంచి యాారా! దురీహులం డీ మేల కింతలు సేసెనే యనుచు డగ్గఱి సొలపుఁ గన్న వారి నిర్వర్ణించి నిర్వేదించి యందు నిందీవరనయన నిందిందిరకచ నిందిరామనోహర నిందుసుందరాస్య వినయంబుమందిరంబో? గుణ ముల కారణంబో? కాంతియుదంతంబో? భక్తియాధారంబో? పాతి వ్రత్యంబురూపంబో? యనఁ దగు నమ్మగువ-సిలుగులు వడుటకు వగచి యమ్మా! యాదిగర్భేశ్వరి! త్రిదశజనని! నాకుఁ గా నిట్లు పొలయు చుంటివే? యని కనికరించి విరించిపలుకు తెంచి కించిదాత్మత గర్భంబుఁ బ్రవేశించి భ్రూణంబు నావేశించి సబలం బగు శుభలగ్నంబు శుభేక్షిత యుతంబై యుండ న య్యండజాఖండలకేతనుండు చతుర్భుజుండును సాయుధుండును సవిశేషుండును నయి వేలుపులపూలవానతోఁ గుక్షి భాగంబు వెలువడి కలుము లీను మేని కలికితనంబున న న్నికేతనంబు వెలింగించుచు మెఱసి రోదనంబు సేయుడు న జ్జాయాపతులు ప్రత్యా గతప్రాణులై ముందటి యన్నందనుఁ జూచి త్రిదివంబున నున్నట్లు, సామ్రాజ్యంబు వహించిన భంగి, నమృతంబు కరగతంబైన రీతి, విశ్వంబు వశంవదం బైన మాదిరి, మాదిరి లేని యానందంబునం బొంది బొంది మఱచి మూర్ఛ వచ్చినట్లు స్తంభభావం బెనయం గొంతసే పూరకుండి యెట్టకేనిఁ దెలివి దెచ్చుకొని— ౫౫

సీ. ఏ రూపు గా కుండి యెల్లఁ దా ననఁగ నై
"యిద మిత్థ" మనరాక యిరులమూఁక

స్వప్నల కలరారు దివ్యోవై పుట్టుట
　　　గిట్టుట లేక నిష్క్రియత వెలయు
స్పష్టీడ వయ్యు మాయావలనమ్మున
　　　సపరిచ్ఛదుండ వై యుపచరించు
కలియుకక్న్రియ నేర్మికల్మి కెప్పుడుఁ జొక్క-
　　　వైకుంఠనాథుండ వేకృతమునఁ
గాన్పవై కను ల్సల్లగాఁ గానవైతొ?
యని యడుగ రాని ప్రశ్న మేలా కొనవలెఁ?
జోరమె మోహాము సందియమ్ములు దోలంగె
నిన్నుఁ గన్నంత నెదియుఁ గానిమ్ము మీఁద. ౫౬

క. అవిత్రిలోకు హాతడా
నవు నవతాదూరు మునిజనప్రియు నినోష్కే
భవహార! కనఁగంటిమి మా
భవబంధము వాసె శాత్రవనిబంధముతోఁ. ౫౭

వ. అని కొనియాడు మొగిన సుప్రసన్నుం డై తొల్లి మీర లఖండ నియమంబున నన్నారాధించినం దోఁచి యేను మీ యాప్సితం బడుగ ముమ్మారు మా కుమారుండ వగు మని వరం బర్థించితిరి. దానికిఁగా నదితికశ్యపు లైననాఁ డుపేంద్రుండ నై కౌసల్యాదశరథు లైన వేళ రామచంద్రుండ నయి నేఁడు దేవకీవసుదేవు లనం బరఁగు మీకు వాసుదేవుండ నై పొడమి యస్నృణుండ నైతి ననుచు బాల్యం బెనసిన వాని మోస నేకపాదావలంబిశృంఖలుం డగు వసుదేవుండు వివృతద్వారంబవు కారాగారంబు వెలువడి విష్ణుమాయ నొరు లెఱుంగకుండఁ జని చని వర్షాగమంబునఁ గర్షకజనేంగితం బనం బొంగిన యమునవానపఘ్నంబుగ నుత్తరించి గోకులంబు నాక్రమించి యందు సుందరమవు నందుని యుదవసితమందు నంద మగు నరిష్టంబునఁ బ్రసవక్లేశంబున నొడల లెఱుఁగక నిదుర వోవుచున్న యాతని యిల్లాలికడ ని

ల్లాలితాకారుఁ గుమారు నునిచి తదపత్యం బగు నాఁడుపసిగందు నొం
డెత్తుకొని వచ్చి యెప్పటియట్లు మునుపటి బంధనాగారంబుఁ జొరఁ
బాఱి యుండుటయు. ౫౮

కంసుఁడు కృష్ణసోదరిఁ జంప నెంచుట

ఉ. నిద్దుర లేచి పత్రులు స్వనీడములం గొని కూయుడు న్మరు
త్వద్దిశ శూరు తేజము ప్రవర్తిత మైన సురాప్రియక్రియా
హృద్దయితు ల్సదా కితవు లేధితమారశరాపవిద్ధులున్
మొద్దులుఁ గాని లోకులు ప్రబోధముఁ జెంది రమందసంపదన్. ౫౯

ఉ. అంత ననంతశీర్షమణిహారకిరీటుఁడు కంసుఁ డన్ జగ
ద్ధంత దురంతశౌర్యుఁ డనుజాంచితగర్భగుహాంతరోద్భవుం
డంతము నొందఁ జేయుఁ దను నంచు భయంపడునట్టిఁ డింత కే
చెంతకు వచ్చి నీ తనయుఁ జెల్లెల! యిద్దెసఁ దెమ్ము నావుడున్. ౬౦

ఉ. ఆ చకితాయతాక్షి నత యై యిది యాఁడుది గాని యన్న! నీ
పీచ మడంచు విక్రమగభీరుఁడు పుత్త్రుఁడు కాఁడు కావు మీ
పాచ నటంచు వేడి కొనఁబాఱక నిచ్చిన వాఁడు ముద్దు పోఁ
ద్రోచి ఖపద్ధతిన్ శిశువు రువ్వి యసిం గుఱిసేసి నిల్చినన్. ౬౧

వ. ఆ పసిపాప రూపు వో నిచ్చి యాపజ్జన నెగసి యా జగజ్జనని నైక
బాహాపరీతం బద్భుతంబు నగు డంబునఁ బంబి యంబురుహంబు విడం
బించు నొండు కే లెత్తి మత్తా! నీ పొత్తున నుత్తము లొత్తిడివడు
టకుఁ జిత్త ముత్తల మెనయ నిన్ను దూషించు పొంటెఁ బ్రాదుర్భ
వించిన మత్సోదరుం డదరుండు గోకులమ్మున ధర్మ మ్మనం బెరుగు
చున్నవాఁడు. అడియాసం మాని మానివేని వాని నెదిర్చి యదరక
బీరమ్మున వీరభోగ్యమ్ము గైకొను, మవిజేయుండు సు మ్మతం డని
మునిజనదర్శనీయ యైన వెగడువడి య జ్జడమతి సేయునది లేక మతి
మంతు లవు నజ్ఞాయాపతులమన్నన సేసి నిర్ణిబంధుల నొనరించియు,

మించిన కించున నన్నిసువు నెమకి మసిపుచ్చు నిచ్చ నిశాచరులఁ
గొందఱఁ బనుచుటయు నోలిన___ ౬౨

## శ్రీ కృష్ణుని విహారము

సీ. గరలిప్తకుచము రక్కసి యొత్తిడఁగ దాని
పాలతో నూపిరి గ్రోలివైచె
శకటరూపంబున సాధింప వచ్చిన
కూళ నొక్కటఁ గాలఁ గూలఁ దాఁచె
సుడిగాలివలె వాని సొగయించు నొక్కని
మెడ వట్టి దివిచి యామిత్తి కొసఁగె
బహురూపములు దాల్చి బాధింప వచ్చిన
యొక్కొక్క రక్కసు నుక్కుమడఁచె
నంతఁ గంసుఁడు పిలిపింప నరిగి పెరుగు
మచ్చరమ్మునఁ జాణూరు మల్లు విఱిచి
మొగచి 'హరి హరి' యాతని నిఱ్ఱి సఱచి
పూని తద్రాజ్యమున నుగ్రసేను నిలిపె. ౬౩

క. ఏల బహూక్తి? మసలె వాఁ
డోలి ధరిత్రీమనోరథోద్ధుం డయి య
న్నేల నతిమానుషంబులు
లీల లలర వైరిమండలీదుర్దముఁ డై. ౬౪

## రాధతపము

వ. ఇంతకుమున్ను జగన్మిత్రునకే నాయిక నైన నిత్యానురక్తి యగు నొక శక్తి భూమిగత యవు సౌదామనియో? మూర్తిమతి యగు దీప్తి స్ఫూర్తియో? యకలంక యగు శశాంకకలయో? సుధారత్నాకరమున నవనీతంబో? యబ్జసూతి హృదయశిల్పంబో? యుత్ప్రేక్షావన్నత యవు కవి ప్రతిభయో? నాఁ దగు మైదీఁగకు మెఱుఁ గొసంగు

భసల మ్మెఱుఁగని కుసుమమ్ములో పసివాఱని కిసలమ్ములో యన మించు నిఖిలాంగకములకుఁ గలిమి గలిగించుచు వృద్ధిజీవను లనఁ బరఁగిన జఘనస్తనముల కడిమి నాక్రమింపఁబడిన మధ్యము పేదతనము న్యాయంబు కా దని మధ్యస్థము లై తగవు సెప్ప వచ్చిన వళుల నడుగునఁ బడవైచి బలవత్పక్షమ్మున లంచ మీ వచ్చిన మానిసివలె మునుమున్న వెలవెలబాఱు మోముతోఁ బొడచూపియుఁ గార్శ్యసంసిద్ధి మెయి నెసకంబునఁ గరంబితం బగు రోమావళిఁ గని కోపంబున నెఱ్ఱ నగు నోష్ఠంబు నధరం బని వాదుబెట్టిన తత్సజాతీయము లగు నలకలఁ దామసము లని చేరనీక యవలఁ ద్రోయించు రాజకల యనఁ దగు లలాటపట్టికం గాంచి సంతసించుచు సాత్త్వికస్థితి నుదాసీనము లై మను లోచనాబ్జములకు నిదానము లైన శ్రుతుల పేరిటి పరసులదరి నమరు స్ఫాటికతలంబు లన నైన కపోలఫలకంబుల యంతర్గృహంబున నొదిగి నియమంబునఁ దేజంబు నెనసిన ద్విజసమూహమునకు సన్నిహిత యగు వాగ్దేవిచేతి చిలుక యెలుఁగునకు స్థానం బగు గళంబున నంతర్వ్యాప్తి వళిత్రయి యన మించు రేఖాత్రయి సోయగము నెంచి పొంగిన యంసముల మోసల పుప్పొడితిప్పల సౌరభముఁ గని ముఖకమలాకరంబుపొంత నాస యను చాంపేయంబు నునికి నది పరిహరించి వ్రాలిన యళు లన నొప్పు చూచుకములు చూచి కమలిని యను ననుమానంబునఁ బరతెంచి మగిడిన లలితోరుకరికరంబు లంత కావలె నని యాశ్రయించిన జంఘ లను నంతేవాసుల యడుగులకు మడుఁగు లొత్తు గృహస్థుల స్థితి విడంబించు నడుగుగెందామరల దలము లగు వ్రేళులకు భూషణంబులు కావచ్చిన నఖములను నక్షత్రమ్ముల సల నఖ మ్మొనరించు నొక్క చక్కని యన్నుమిన్న యై నందుని మఱంది యగు శతగోపుని నందని యన రాధానామంబున నొప్పారి య పూరుషోత్తముఁ జిత్తమ్మునఁ గామించి ఋణవిమోచననామకతీర్థమ్మునఁ దప మ్మొనర్ప సమకట్టెన.

ఉ.

ఉ. కాంతల మోవి కెంజిగురు గా ఖ్లిలయించి రసో త్తరంబు నాఁ
గొంత దలిర్చి యన్నలినిఁ గుంతితఁ జేయుట నొప్పకుండియుఙ్
గంతునిఁ జేరఁదీసి తమకంబున నెల్లెడ లల్లి పర్వె హే
మంతము యావతాధ్యకుచమండలభిన్నజగద్విగాహిగాఙ్. ౬౬

క. ఆతని యనుజుఁడు శిశిరుం
డాతతతద్గుణవినీతుఁ డై తనరారెఙ్
భూతలమున నెవ్వారికి
జ్ఞాతుల పోలికలు తప్పిచను రాకుండఙ్? ౬౭

సీ. పద్మినీమహితసంపదలు గొల్లొచ్చెఁ బో
కుందమ్ములఁ గొసంగెఁ గొమరుకలిమి
జగమెల్లెడల నవశ్యాయంబు నించెఁ బో
యుష్ణాంశుతాపంబు లుడిపివైచె
నపఘనావళి నెత్తురడుగంట విఱిచెఁ బో
క్రొత్తదానికిఁ గొంత త్రోవ సూపెఁ
జలదన మ్మొసఁగొల్పి చలము సాధించెఁ బో
శ్యామాస్తనాతిసంస్తవము గూర్చె
భూగృహము వేఁడినీళులు భోగవతులు
లుఁగ భోగుల కొక్కంత కలదె? కొఱత
మైపె యభ భేదమే వేరుపఱిచెఁ గాక
యోగులకు సున్నె? యొండేనియును సుఖ మని. ౬౮

ఉ. ఆశిశిరర్తు ప్రాప్తి యగు నంత ననంతము వొల్చె సంభృతా
భ్యాశము భాసమానమధుపప్రకరప్రచితప్రసూనసం
కాశకానానాంతరపికస్వరవై భవమారపూరితా
కాశరసాంతరాళజయకంబురవంబు వసంత మింబుగఙ్. ౬౯

సీ. అవరోధరహితచంద్రాతపంబు గఱించె
మానినీమానసాశ్మవ్రజంబు

పుంస్కోకిలాలాపముఖరదిఙ్ముఖములు
మగలకుఁ గఱపెఁ బల్మారు దగవు
చందనాచలతుందకందరానిలములు
జీవరాసుల నొక్కత్రోవ నడిపెఁ
బ్రాప్తపరిమళ మైన వనీలక్ష్మి
పౌరపౌచ్చెముల నెల్లఁ బుచ్చివైచె
మారుఁ డేకధన్వుఁ డై రూక్షశరపాళి
నాక్రమించె మించి యువనిచక్ర
మల్ల నల్ల ఫలము లాసించె వశిగణ
మతుల మైన మాధవాగమమున. 20

వ. తదనంతరబు. 21

శా. కాల్చెం బర్వతగుర్వరణ్యపటలీక్రామద్దవాగ్నిం దెసల్
పేల్చెం బ్రాకటసైకతప్రచురపృథ్వీభాగముల్ జీర్ణముల్
రాల్చెం బర్ణము లా ద్రుమావలుల రౌద్రంబౌర నొక్కుమ్మడిన్
గెల్చె న్విశ్వము విశ్వముల్ స్వపటిమన్ గ్రీష్మంబు భీష్మాకృతిన్.

ఉ. ప్రేలిన దేహవల్లరులు బిట్టుచెమర్చిన మోముదమ్ములున్
వ్రీలిన కేశపాశములు వెచ్చని యూర్పులు జాఱుపయ్యెదల్
కేలుల సీవిరు ల్సలిలకేలికుతూలహముల్ రహించు శం
పాలలితాంగు లప్డు నిజభర్తలఁ దన్పిరి చూడ్కిమాత్రకున్. 23

శా. పంచాగ్న్యంతరభూమిభాగగత యై పత్నప్రియాహార యై
పంచప్రాణవివర్జ్యమానకృప యై భాస్వత్తపస్తప్త యా
పంచాస్యోపమమధ్య తమ్యోఢ సుఖప్రారంభుఁ డై తోఁచెఁ ద
త్పంచాస్యాంచితకంఠకాంతి యువ వార్వాహుం డఖండార్భటిన్.

సీ. అవయవంబుల నంటు నవనీపరాగంబు
గడిగె మానులకుఁ దీగలకు నొకఁటు

చిరకాలతృష దీర్చి చెలయించెఁ బాంథుల
తరుణీవ్రజంబుఁ జాతకగణంబు
వెలలేని తనకల్మి విప్పారుట లమర్చెఁ
గడిమిడియందు న క్కడిమియందు
పస్యదేశావాస మనుభవింపఁగఁ జేసె
హంసలచే వ్యళీకాళిచేతఁ
జేర్మి నుచ్చ్వాన మొనరించె విపుల మేను
రాధికాదేహయష్టి కార్శ్య మ్మడంచి
నెమ్మలకుఁ గూర్చె నించెఁ ఖాతమ్ము లెల్లఁ
బంచి కొనఁబాఱిన ఘనాగమంబు డంబు. ౭౫

క. జలదఘనాగమమునఁ దె
క్కలి దోఁలగం బాఱి నెన్నఁగానగు కాంతిన్
బులు గడిగిన ముత్తెం బనఁ
గల వెట్టిన కనక మనఁగఁ గనకాంగి తగెన్. ౭౬

మ. ఒకనాఁ డా కమలాయతాక్షి యొసకం బొప్పార హృత్పద్మపీ
ఠక నీలాశ్మసమానవర్ణ వనవాటీరంజనాతత్పరున్
సకలాపు న్సుకలోపశోభితు ఘను న్ధ్యానప్రవాహప్రణా
ళిక మోఁలం గనినట్లు కాంచి తతముల్లీలం గను ల్మోయుడున్. ౭౭

ఉ. కస్తురిబొట్టు నెన్నదుటఁ గమ్మని గందము మేన యొమ్మునం
గౌస్తుభ మందియ ల్పదయుగంబునఁ గంకణము ల్కరంబున
న్విస్తృతరత్న మౌ నెమలిపింఛము చొళ్లెమునం దలిర్పఁగా
నిస్తుల మైన రూపమున నీరజనేత్రుఁడు నిల్చె ముందటన్. ౭౮

## శ్రీకృష్ణుఁడు రాధ ననుగ్రహించుట

ఉ. దాపటఁ బొంగి భక్తిమెయిఁ దామరసాయతనేత్ర మ్రొక్కి ని
ర్వ్యాపహరాత్మ మైన వచఁ దాలిమి సాలమిఁ గేలు కేలుఁగోఁ

బూని నిజాంకభాగమునఁ బొల్తి నమర్చి మహానుభావుఁ డెం
తేని సుఖాబ్ధిఁ దేల్చి వెలయించెఁ దపంబు ఫలంబు లింబుగన్. ౭౯

ఆ. అల్ల వాసుదేవు నారాధికాతన్వి
నొకటి సేసి మేలి యోల మరసి
మెలపు గలిమి మెల్ల మెల్లనఁ గుంకెన
కాఁ డనంగ నొదిఁగెఁ గాఱుతఱియు. ౮౦

చ. మరువము కాశచామరసమాజము దామరపూవులు న్నిరం
తరకరిదానతోయము లుదారపు వెన్నెలవెల్లవల్వలుం
దొరకొనఁగా వనీకమలతోఁ జనుదెంచెను ధీరమూర్తి యా
శరదృతు వల్ల రాధికకుఁ జక్రికి నూడిగము ల్వొనర్పఁగన్. ౮౧

మ. అమలోదం బతిమాత్రగంధిల దిగంతాయాతసద్గంధవా
హ మసన్యాదృశసప్తపర్ణతరుసామామోద మానత్తటీ
యమునాసైకతకుంజపుంజముల సౌఖ్యం బందు రాధాచ్యుత
ప్రమదం బచ్యవనం బొనర్చె ఘనసారప్రఖ్యచంద్రప్రభల్. ౮౨

చ. చులుకితసప్తసాగరుఁడు శోషితవింధ్యధరాభిమానుఁ డు
జ్జ్వలమహనీయభావుఁ డవు సంయమి గన్పడెఁ బుండరీకు ని
ర్మలనియమప్రకారము సమస్తము న క్కమలాక్షుతో వెసం
దెలిపి శుభంబు గూర్ప నని తెల్వి వహించెను బుండరీకముల్. ౮౩

ఉ. ఎండకు వానకుం జలికి నించుక జంక కొగిం దపించు భూ
మండలమండనం బయిన మానికులాగ్రణి పుండరీకు ను
ద్దండయశఃప్రసాదమునఁ దద్దయుఁ బూఁత వహించె నాఁగ బ్ర
హ్మాండము శారదాగమము నప్పుడు నిర్మలమయ్యె నెయ్యెడన్.

శ్రీకృష్ణుఁడు పుండరీకవరదుం డగుట

ఉ. మానితపుండరీకనియమంబున నాత్మసుఖప్రసక్తి న
వ్వాని మహార్హభక్తి వ్రజభామల నాతని గోకులాప్తి నిం

ప్రాచిన గోకులం బతని యున్నతమానససీమ నైజని
ర్మాణము గీటువుచ్చి చనె మాధవుఁ డా దెస దత్తచిత్తుఁడై. ౮౫

మ. షడర్మివ్రాత మగల్చి యిం బగు సహస్రారంబుఁ బ్రాపించి య
క్కడఁ జొత్తిల్లు సుధాప్రసారము బుభుక్షం బాపఁ బాపంబు గ్ర
క్కడఁగ న్సర్వము దాన యా తెలుఁగు నైక్యస్ఫూర్తి నానంద రూ
పుఁడు వ్యాసీంద్రుఁడు పుండరీకుఁ డటుమైఁ బూజించి నిష్కాంతుఁడై.

క. కరమునఁ బిల్లనగ్రోవియు
నురమున వనమాల చూడ్కి నుత్సుకత కటిం
హరితాంబర మరుదుగ ము
దర సన్నిధి సేసియున్న దైత్యారిం గనెన్. ౮౭

గీ. కాంచి రోమాంచితంబు సకంప మైన
స్విన్నగాత్రంబు విప్పారు కన్నుఁగవయుఁ
గా మునీంద్రుండు ప్రణమిల్లి కల్పకంబుఁ
జూచితి నటంచుఁ బొంగి యచ్యుతున కనియె. ౮౮

చ. అవనియుఁ గాక యప్పునకు నన్యము నై జ్వలనంబు మించి వా
యువునెడఁ గానరాక గగనోపమితం బయి యవ్యహంకృతిం
బ్రవులసి నై మహత్త్వమునిధానము నాఁదగు నా ప్రధానమున్
గినిసి సుఖాంబువానికిని గారణ మా నిను నాశ్రయించెదన్. ౮౯

క. శ్రీనాథ! ముంజమునఁ బెం
పూను నిషేకంబు పోలె నొగిం నాహం దే
హో నేంద్రియాణి "యను మతి
శానె నెమకిన నుండు వెందు దురితవిదూరా! ౯౦

క. ఇన్నిఖిలార్థము లెడపడు
చెన్నున నింద్రియము లడఁచి చిత్తము వృత్తి
చ్ఛన్నత పో నేకమతి
న్నిన్ను నెఱుఁగునట్టిఁ డెందు నీవ యధీశా! ౯౧

ఉ. ఏదియుఁ గాని చీఁకటికి నెంతయు దవ్వుల వెల్గు వెల్గు నన్
బ్రోది యొనర్ప నిం పయిన రూపముతోఁ జిఱునవ్వుమోముతో
నా దరి కేఁగుదెంచె నెటె నా కిఁక నెందు నసాధ్య మేది? యం
చాదితిభూవిరోధిచరణాబ్జయుగంబున వ్రాలెఁ దృప్తితోన్. ౯౨

ఉ. దానికి సంతసించి మలదారి బిరానఁ గరాన నెత్తుచున్
దా నిటు వల్కెఁ- సంయమనిధాన! మహీదివిజప్రధాన! నీ
కీ నిఖిలప్రపంచమున నీ డొకఁడేనియు లేదు నాదు స
న్మానము గొంటి వాథ్యనియమ మ్మను సొమ్మున నిమ్మొగమ్మునన్.

సీ. వేదశాస్త్రార్థము ల్విమలాత్మతఁ బఠించి
మునుమున్న తీర్చితి మునిఋణమ్ము
సత్పుత్త్రితోడ నిష్టాపూర్తము లొనర్చి
పాచితి వల్ల గీర్వాణఋణము
తల్లిదండ్రుల సేవఁ దనిపి సంతతిఁ గాంచి
నెడలంగ నీదితి పితృఋణమ్ము
నతిథుల బంధుల నర్థాప్తిఁ బూజించి
మానుగ నీగితి మనుజఋణము

ననఘ! నీకు నెద్ది యయ్యె యీఁ గల దింత
నదియె స్వర్గమార్గ మజునిలోక
మునకు శైవవైష్ణవనగరులకుఁ ద్రోవ
లివియె యీప్సితంబు లెనయుమయ్య! ౯౪

క. ఆతతవైభవదిత్సా
జ్ఞాతము లవు కల్పకములు స్వర్గ్యామాక్షీ
వ్రాతము మొదలుగ నియమ
క్రీతము లగు నెల్లసిరులఁ గ్రీడింపు మునీ! ౯౫

వ. అని యుత్పలకుండై వాక్రుచ్చు చక్రహస్తుని స్తుతివిస్తరములకు
మస్తకము వంచి నిజవినయభరితమృదుమధురవాగ్విసరప్రసవావళికి

సమ్మథు వైరి మధువ్రతమ్ముఁ గావించి దేవా! నాకుం గరుణింతు వేని నీ తుచ్ఛసుఖమ్ములఁ బేర్కొననేల? యిన్నేల మన్నామమ్మున సన్నుతమ్ముగా నీ యంచితాకారమ్ముతోడనే సన్నిధిసేసి స్నానదాన జపపూజాదర్శనాదులవలన జనుల కపవర్గసౌఖ్యం బొసంగుచు నన్ని పున్నెపు న్నెలవులకన్న మిన్నయగు చెన్ను సంపాదింపవే. భవత్పాద సేవనంబున ననుగృహీతుండ నయ్యెద నను మునినాథు నభిమతంబులు ప్రసాదించి పంచశరద్వయస్కుండును బర్హిబర్హాభాసమానాలకబంధుండును నానాభరణభాసురుండు నై నడికట్టు గల కటిప్రదేశమ్మున నర చేతు లుభయపార్శ్వంబుల మోపి నాఁటియుత్సాహం బీనాఁటికిఁ గన్పడ నయ్యెడ నిలిచి వాలిచె. నప్పు డప్పుండరీకాక్షు యోగ్యత్వమ్మును బుండరీకు భాగ్యమ్మును మెచ్చి వర్షించు సుమనసుల వాక్కుసుమంబులయుఁ బారిజాతసుమంబులయు మధురిమకు మధురములై జగమ్ములు సుఖించె. న మ్మాయామనుజుండు క్షేత్రంబునఁ దూర్పు మొగ మై తీర్థంబునఁ బడమర మొగ మై శ్రీహ్రీరూపంబుల సంపద సేవింప నెదుర వినతకొడుకు వినతుఁ డై కొలువ దక్షిణభాగంబున సనకాదులతో నజుండును నేను రుద్రులతో వామభాగంబున నుండ నున్న వేలుపు లెల్ల వెనుదవిలి నిలువ ద్వారాష్టకరమ్యం బగు హర్మ్యంబున ఫణాధరపీఠాగ్రిమతలంబున డంబుకొని యుండు.

నా

పౌండరీకాశ్రమము

సీ. శరదిందుముఖి సరస్వతి యక్షమాలికా
శుకహస్త యై శ్రుతిస్తోమము గొని
త్రిదశార్చితుండు నారదుఁడు నై ణవముద్ర
తో నాగసతులు ప్రస్తుతు లొనర్ప
హ్రీంరూప భువనేశ్వరీదేవి పాశాంకు
శాఢ్య యై విద్యాధరార్చ లెసఁగ

మహిషకీకసహారమానిత దుర్గ కే
సరివాహ్యమాన భూసురులు గొలువ
నాల్గు వాకిళులందు నున్నారు వారిఁ
జేరి దర్శించి ధ్యానించి గారవించి
యెల్లవారలు నపవర్గ మిమ్ముగా స
మస్త మెనయుదు రంహోనిరస్తు లగుచు. ౯౭

వ. మఱియు నా హరికిఁ బడమరగా నూరువిండ్ల దూరంబునఁ బద్మా నివాసంబగు పద్మతీర్థమ్ము కలదు. అచటఁ బద్మశంఖము లనఁ బ్రసిద్ధము లగు నిధులు వెలయు. నచ్చోటన దుష్టనిశాటులకుఁ జోటు వెట్టక త్రివిష్టపాధిపతి రాజ్యం బేకాధిష్ఠితం బొనరించువారు దేవబ్రాహ్మణ గోధర్మవిఘాతుకుల శిక్షింపఁ బ్రతియుగంబు నవతరించువారు బ్రహ్మచర్యమ్మున నెప్పుడు దపం బొనరించువారు నరనారాయణు లను దేవమును లశ్వత్థాకారు లై విరాజమానమానవివేకాదిసమగ్రు లై యుందురు. తద్దిశన మూడుకోటులు వేలుపుబోటులు మేలిమికడాని పళ్లెరంబుల మానికపుటారతు లెత్తుచుందురు. శౌరి యొకసారి క్షేత్రమున కీశానభాగంబునఁ దనకుండలములు డాచిన నది కుండలతీర్థంబనం బరఁగె నచ్చోదం బగు నయ్యేడఁ గ్రుంకు వెట్టిన దుస్స్వప్న దుశ్శకునాదిదోషంబు లెడగలుగఁ దొలఁగు నాయెడన. ౯౮

## నృసింహతీర్థము

చ. భువనవిరోధిహేమకశిపుప్రకటాసురసంజ్ఞమూర్తి సం
భవనిధనప్రధానభవపాశవిపాశకరప్రశక్తి మా
నవమృగరాజలక్షణకనత్తనుపూర్తి మహోర్జ్వకీర్తి కే
శవుఁడు రహించు నా విభు ప్రసత్తి విచిత్రతరంబు తద్దయుక్. ౯౯

గీ. నిగమశర్మాఖ్యు ద్విజు నతినిష్ఠురు నన
ఘాని పాపము ల్చేసిన వాని నంట

రాని దాని కైవస మైనవానిఁ గాచె
యమభటులచేతి చేతల కమరకుండ. ౧౦౦

క. సమయముఁ దన నైర్వ్యకుంతుని
సముఖమ్మున నాతఁ డిప్పుడు సౌఖ్య మొనసెడిన్
సుమహితములు తీర్థము లి
ప్లావితము లటుఁ జెందియున్న వది యట్లుండన్. ౧౦౧

## త్రి పు రా సు ర సం హా ర ము

సీ. త్రిపురదానవులకుఁ జిక్కి దేవవర్యు
లచ్యుతుఁ బురస్కరించి న న్నాశ్రయించి
రక్ష సన్నాహ మెల్ల మే లమరఁ గూర్చి
కనుసరించిరి జయజయేత్యార్భటి కయి. ౧౦౨

ఉ. ఒక్కటఁ గూడికాని హతి నొందని యట్టి వరంబుఁ గొన్న యా
రక్కసిజేండ్ల పల్లియలు రా వొకతావున కట్టు లౌట నే
నక్కమలాక్షు నారసము నగ్గిఁ దదంత మొనర్చి పేర్చి నా
యిక్కడఁ జేరఁ బాశుపత మేసితి వాసికి వన్నె పెట్టుచున్. ౧౦౩

క. తన్నారాచనితాంతవి
పన్నితము లగుచు మూడు పల్లెలు నొకచోఁ
దెన్న పెకఁ గూడి నిలిచె జ
వాన్నదమనము లై తడబడి యాగ్నేయము లై. ౧౦౪

శా. తత్కాలంబున నొండు కన్ను దెఱవం దాఁ దోఁచి జాజ్వల్యమా
నోత్కాలానలవిస్ఫులింగనినదప్రోద్దామనీరోధని
ర్యత్కీలాక్రాంతదిగంతకాయకమనీయామేయధూమచ్ఛటా
సత్కాంచం బకలంబు ముట్టికొనె న య్యూళ్లొక్కటన్ నీరుగాన్.

## చం ద్ర భా గా ప్రా దు ర్భా వ ము

క. ఈరీతిఁ ద్రిపురాసురసం
హారం బొనరింప జగము లాయతిఁ గన దై

త్యారు లెఱిగి యరిగిరి నిం
డార శ్రమాంబువులు దోఁచె నలజడి నొడలన్. ౧౦౬

సీ. నిర్మల మగు మేన నింగిఁ జుక్కలవోలెఁ
దలయెత్తి ముత్యాల తరగతి గని
యటు ప్రవృద్ధము లౌచుఁ జొటచొట మని జాఱి
తాఁకి యొండొంటితో దారగట్టి
తరలి యొయ్యన నేలఁ దడిపి కాలువగట్టి
పాఱి మిట్టు లగల్చి బలము మిగిలి
పెన్ప్రమాఁకు లిరుదెసఁ బెకలించి రయమూర
ధ్వానప్రధానప్రవాహ మగుచు
మలయు మత్స్వేదలవము భీమరథి భైమి
చంద్రభాగ యనంగ సంజ్ఞల వహించి
భాగ్య మాపగలందుఁ బేర్వడయఁజేయఁ
బంచి యొకపరిఁ బౌండరీకంబు డాసె. ౧౦౭

క. బహులోర్మిబాహురుచితోఁ
గహనంబులు గిరులు గడచి కడువడి నుచ్చై
స్స్పృహ నూర్మిమాలికై చను
లహరిక సంరంభము గని లావతి పౌరుల్. ౧౦౮

క. ఈ యేటివలని కాఱియ
వాయఁ దలఁపుమయ్య క్షేత్రపాలక! ది క్కే
రీయెడ మా యెడ రుడుపఁగ
నో! యని మొఱవెట్ట వాఁడు నుద్వృత్తుం డై. ౧౦౯

శా. ఏకాంతంబునఁ గాలరాత్రి యుపగూహింప న్సుఖం బుండియున్
డాకేలం గల శీధుపాత్ర మొక జాడ న్వైచి యేతెంచి పె
న్వీకం గైకొని యెత్తి యాఁగుము స్రవంతీ! నిన్ను వీక్షించి యా
లోకుల్ ప్రమాస్పడి రీశుఁ డొప్పఁ డను నాలో భీతభీతాత్మయై. ౧౧౦

క. అనిర్ఝరిణీతిలకం
బానిస్ఫురభైరవవచనాహతరయ మై
మానికులమాననీయున్
శ్రీనాయకుఁ బాండురంగనిం గొనియాడెన్. ౧౧౧

సీ. పుండరీకమనీషిపుండరీకద్వేషి
వలపుమై నెద్దాన జలకమాడె
రాధాసరోజిని రమణీయభావంబుఁ
బోషించె నెద్ది యపూర్వ రసత
దులఁదూఁచె నిను జేతితులసీదళమ్ముతో
భీష్మకసుత దేని పేర్మినేర్మి
నెద్దాని ప్రాభవం బీశ్వర! నీయట్టి
రథచోదకు సమర్చె పృథ సుతునకు

నట్టియం బెద్ది యల నీ దయాసముద్ర
మందు బిందువు లొండు రెం డైనఁ జాలు
నన్ను మన్నింప భైరవు మున్నిడుకొని
నాకుఁ దెరు వీఁగదయ్యా! యనాథనాథ! ౧౧౨

మ. అను వాకు ల్విని వాక మెచ్చి విభుఁ డో యజ్ఞాక్షి! పూర్వారిమే
నున నుద్భాతిమెయిం బవిత్రతమ వర్ణోర్వాశి మై వ్రోంగ నా
తని సేవింపఁగ నేగుచుంటి వగునే? త న్నాగ మత్క్షేత్ర మె
ల్ల నితాంతోజ్జ్వలపూత మై వెలయ లీలం బొమ్ము నీ యిచ్చతోన్.

ఆ. ఎల్లనదులలోన నెన యొందు నీకు లే
దష్టమూర్తి మేన నవతరిలుట
నాప్రసాదమునను నా తల్లి పెల్లు వై
భవముఁ జెంది భవుల భవ మడఁపుము. ౧౧౪

క. అని యానతీయ నా నది
వినమ్రమై విభునిఁ గొలిచి విశ్రుతయాదో

వనజాతతవనజావిభ
వనవీనత దోప నచటఁ బఱచె నభయ మై. ౧౧౫

వ. ఈపరిపాటి— ౧౧౬

గీ. పౌండరీకంబు క్షేత్రరాడ్భావితంబు
భీమరథి తీర్థరాజంబు విట్ఠలయ్య
సర్వదేవసమాహారసార్వభౌముఁ
డీ త్రితయ మొక్కచోట సమిత్థ మయ్యె. ౧౧౭

సీ. పలుపుట్టువుల మేలు పరిపాక మెనసెనా?
శ్రవణంబు విట్ఠలేశ్వరుని నెమకుఁ
బౌండరీకనివాసు పద మొందు చెవిఁ బడె
నా? పుట్టు నాతఁ డన్నగరసీమ
నచ్చోట సంభవం బందెనా? త్రావు ని
చ్చలుఁ జంద్రభాగాప్రశస్తజలము
భైమీనదీపయఃపానంబు సేసెనా?
క్రోలఁ డెన్నఁడు మాతృకుచపయస్సు
నిఖిలలోకంబులందును నెగడుఁ బెద్ద
పేరుకల్మి నతండపో పృథ్విసామ్ము
సౌఖ్యములు వానియవియె మోక్షంబుమాట
వలువకొంగునఁ బన్నిన చలిది మూట. ౧౧౮

సీ. ఆయుధంబుల మాట కడరు ముందల దాట
నచటు వాసి వడంకు నట్టి భీరు
వలిసీలకచలు దవ్వులఁ దన్ను నిరసింప
నటు చూడ్కి యిడని షండాధముండు
కాలీచవడ నెన్ని గవ్యూతులే నప
యానుఁడై పరువెత్తు నట్టి యవిధి

యాదరంబునఁ బ్రమత్తార్థవత్కోటిఁ బెం
పఱుఁ జేయిసాచెడు నట్టి బీద
పౌండరీకరసోచ్ఛలత్ప్రాణుఁ డైన
వేయియంచులకైదువ వెరవునఁ గొని
సారగాణిక్యము వరింప శకునిరాజ
వాహితుఁడు నై నిలింపుల వరము లొసఁగు.

సీ. ఏ మేల్పు పొలయల్క నెనసిన భామ కెం
గాలిసొమ్మైన శృంగారరసమొ?
ఏ దేవుఁ డదరమహాదైత్యనగముల
మాను గట్టఁగనీని మాలువేరో?
ఏ విభుండు ధనంజయావారితస్యంద
న మలంకరించు కిన్నరవరంబో?
ఏ నేత మునినాథహృదయాంబుజాతాంత
రాళవిహారి మహాళిపతియొ?
ఆ యఘవిదారి యగ్రకౌంతేయపూజ్య
మానమానరహితహితదానవిత్త
చరణసరసీజుఁ డగు నందు సర్వసుకృత
మందు నివసింప నొందిలి యనఁ గలుగునె?

సీ. జలక మాడించి మే ల్చందనం బలఁది పే
యముల భేదము లుపహార మిచ్చి
ధూపదీపములతో రేఁప గోర్వెచ్చ నా
నేయియుఁ గలమాన్నము లిడి
మరువమ్ము దులసియు మాచిపత్రియుఁ గూర్చి
కలితాన్నపక్వభక్ష్యంబు లొసఁగి
కనకావదాతాంశుకము లప్పనముసేసి
మెలవేఁడి యభ్యవహృతు లమర్చి

కుందమాల గట్టి కూరఁ గూరము నివే
దించి పూలగముల ముంచి ఫలము
లాహరించి విడెము లర్పించి హరి నాఋ
ఋతువులందుఁ గొలువ నెసఁగు ముత్తి. ౧౨౧

పుట్టరో? పలుమార్లు పుడమిఁ బుట్టరు గాక
పౌండరీకాశ్రమప్రాంతమందు
మ్రొక్కరో? యొండువేల్పులకు మ్రొక్కరుగాక
పాండురంగని పాదపద్మములకుఁ
ద్రావరో? పెక్కునీరములు త్రావరుగాక
భైమీనితాంతపావనజలంబు
నోమరో? నోము లెన్నుకొని నోమరుగాక
కనులార నిమ్మూర్తిఁ గాంచు నోము

నమృత మందఁగ రాని మర్త్యాధమర్ణ
లింత లింతలు మహిమంబు లెందుఁ గలవె?
యచటి గాడ్పోకయింత పై నలమెనేని
పూరియేనియు మృత్యువు పొడ వడంచు. ౧౨౨

వ. కల దధ్యాత్మవిశారదు ల్మనమునం గాంక్షించు తత్త్వంబు గొ
ల్లల యిల్లాండ్ర మనంబునం దరుల ఱోళ్ళం గోకులంబందు నా
లలిఁ దద్భక్తినిబద్ధమై యెసఁగు లీలం బౌండరీకంబునం
దలినీలం బభిధేయ మౌపనిషదం బాకీటముం దెల్పుచున్. ౧౨౩

గీ. ఇచ్చవచ్చినరీతి స్మరించి తిరుగు
కుస్మృతిసంసారపంకమగ్నులకు నెందుఁ
బాండురంగదయాంబుప్రవాహమందు
మునుఁగకుండిన డిందునే? ముఱికివఱపు. ౧౨౪

సీ. ఎవ్వాని కొకసారి యెఱఁగి మ్రొక్కినఁ బాయు
మఱి మ్రొక్కవలయు జంబాల మెల్ల

నెవ్వానికై నామ మింత దలంచినఁ
దలఁగు దుర్ధనుల స్తోత్రంబు సేత?
యెవ్వాని సొగసు క న్నెలయ నీక్షించిన
యమయాతనల గోల లరయఁబడవొ?
యెవ్వానిఁ గైకొన్న యింగితంబున నొందు
సిద్ధాన్త మెన్నఁడు జేరఁబోదొ?
అవ్విభు ననాదినిధను సర్వాంతరాత్ముఁ
బాండురంగాధినాధుని భక్తి మెఱయ
హ్రుతవిమత మైన హృత్పుండరీకమందుఁ
బాదుకొల్పినవాఁడె సర్వప్రభుండు. ౧౭౫

క. ఈ యర్థముఁ జెప్ప వినఁగ
వ్రాయఁ దలఁపఁ బాండురంగనాథుని కరుణో
చ్ఛాయంబున నొదవు శుభ
ప్రాయైహికతాత్త్వికప్రభావము ప్రజకున్. ౧౭౬

గీ. అని సమస్తంబు నిట్లు చంద్రార్ధమౌళి
యెఱుకసేయ మహానంద మంది మ్రొక్కి
క్రౌంచదారణుతోడ నిక్కలకు మాను
లరిగి రనెడు పౌరాణికు నాదరించి. ౧౭౭

గీ. శౌనకాదులు సనిరి తత్సమయకృత్య
సముచితాచారపూర్వప్రచారములకు
ననుచుఁ దెలిపెడు హరిదానుఁ గొని నుతించు
శ్రోతల విమర్శములు వొల్చె నీతరమున. ౧౭౮

శా. సంగీతంబును మెచ్చవచ్చు బళిరే సాహిత్యమే రక్తిఁ గూ
ర్చెం గల్యాణకథాసుధారసము చిత్రించెం గలావన్మనో
రంగంబుం గవికౌశలంబ యదియుం బ్రాగల్భ్య మున్నం గదా
భంగం బందక నిల్వఁగా నగు సభ న్సత్కీర్తిఁ దేర్చెం జుమీ. ౧౭౯

గీ. అని యనేకులు మెచ్చి రిష్టానుసార
మెల్ల పరికరమును మున్న నేకగతుల
నంతఁ గొందఱు భావజ్ఞు లరసి పార
వశ్య మెసఁగంగఁ బల్కిరీ భంగిఁ బొంగి. ౧౩౦

సీ. కవితాలతిక యల్లికకు మెచ్చు తజ్జ్ఞుల
చిత్త ప్రసూనంబు చెల్వ మెనయ
శర్వోపదేశితానిర్వాహనై పుణిఁ
దద్గ్రాహ్యముం బ్రమితం బొనర్చి
కృష్ణావతారానుకీర్తనగాథాప్ర
సంగసంగతిసరసత్వ మొలయ
శృంగారభంగీవిశిష్టమై కథ కెడ
పడని వర్ణన భావబంధ మమర
క్షేత్రతీర్థాదికవిశేషకీర్తనమున
భక్తిరసవాహినిం దోఁచి పరముఁ బొగడి
యింద్రియవ్యాపృతులు సెడ నిహము పరము
గాని కైవల్య మొనగూర్చెఁ గథకుఁ డౌర! ౧౩౧

గీ. సగుణతత్త్వముఁ దెల్పు ప్రస్తావనమున నె
భావితాత్ముల కొలసె నద్వైతసిద్ధి
జీవితార్థుం డితఁడు గాఁడు భావయుక్తి
ధన్యు నెవ్వానిఁ గృతిఁ జేయఁ దలఁచినాఁడొ. ౧౩౨

క. అనుచుండ సభాపతి యా
తనికిని బహుమాన మొసఁగెఁ దగు ధనములు వాఁ
డనుకూలింపక పలికెం
వినువారల మదికి మఱియు విస్మయ మడుకన్. ౧౩౩

గీ. త్వత్ప్రసాదంబ కోరెదు దాసజనము
నన్నుణమును జేయఁ జెల్లునే? యర్థ మిచ్చి

యింక నా కల కల లెల్ల నింగితజ్ఞ!
క్రమముగాఁ బ్రకటింతుఁ జిత్త మిదుమయ్య. ౧౩౪

గీ. బహుభవంబులఁ గల్గు సంబంధ మిట్లు
నిన్ను న న్నెనగూర్చె జన్మప్రధాన!
ధనము లక్కఱ లేమి నీ తన్వితోడఁ
జెప్పనే? మాటిమాటికి గొప్పలేల? ౧౩౫

క. జ్ఞేయార్థమె జ్ఞాతవ్య
మ్మీ యఖిలము మాయ యనుచు నేగె నతఁడు వి
ద్యాయుతుఁడై తద్గేహ
వ్యాయామములోని కల జనౌఘము వొగడన్. ౧౩౬

వ. అని యన్నది విని యున్నదాని కట్టులు సాచుటయు. ౧౩౭

గీ. చెన్నకేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహిసమర్పిత మైన యామావికఁ గృతిఁ
బ్రచిత మైనది నాల్గవు ప్రకరణ మిది. ౧౩౮

గీ. తాడెపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ సమరితి మిటు. ౧౩౯

శ్రీ శివాయ గురవే నమః

# యామాపిక

## పంచమ ప్రకరణము

ఉ. తిమ్మని బ్రహ్మ బ్రహ్మ నటు తిమ్మనిఁగా నొనరించుఁ బూరి వ
జ్రమ్ముగ వజ్రముం దృణతరమ్ముగఁ జేయును దేనిశక్తి జ
న్మమ్ము సుఖమ్ము దుఃఖ మసమమ్ము జగమ్ము నొనర్పఁ గా నిదా
న మ్మగు న య్యదృష్టకలనమ్ము శుభప్రతిపాది యయ్యెడుఁన్.

* * *

క. శ్రీచెన్నకేశవాభి
ఖ్యా! చిన్మాత్రా! మదాంతరాంబుజభృంగా!
నీచజనదూర! యస్మ
ద్వాచావీచీవిహారవాంఛాలోలా! ౧

వ. వాసుదేవశాస్త్రి మాకు నెఱింగించిన తెఱంగున— ౨

మ. వినవయ్యా! యొకనాఁ డొకానొక పురి న్విఖ్యాత మా చత్వర
మ్మున నుద్యోగులు పండితు ల్ఘనులు సద్బుద్ధు ల్ధనాఢ్యు ల్మహా
సనసందోహ మలంకరించిరి కటచ్ఛన్న ఉమాభాగమం
దు నితాంతోత్సుకత న్వసించె జన మెందు న్సందు లే దాసభన్. 3

గీ. ఇసుక పైఁ జిన రాల దయ్యెడ ముదమున
వచ్చుచుండె జనం బింక వఱదవోలెఁ
ద్రోవఁ బోయెడు వా రెల్లఁ ద్రోచికొనుచు
వచ్చి వేలమువెఱ్ఱిగాఁ జొచ్చి రెలమి. ౪

గీ. ఏమి సభ యిది? సంగీతమే? కవిత్వ
మా? పురాణమ్మొ? బొమ్మలయాటయొకొ?

హరికథయొ? యేది యే నుపన్యాసమొ యని
యడుగువారలె కాని చెప్పఁ డొకఁడేని. ౫

## అ ష్టా వ ధా న ము

ఉ. అంతటఁ గొంతకాలమున కయ్యొడకుం జనుదెంచె నొక్క ధీ
మంతుఁడు సానుగుం డయి సుమస్రజ మాతనిగ్రీవ నుంచి య
త్యంతవిశిష్ట మాసనమునం దతని న్వినివిష్టుఁ జేసి స్వ
స్వాంతము లుల్లసిల్ల సభవారలు గొట్టిరి బెట్టు చప్పటుల్. ౬

గీ. డాసుగా రని పిలిచి యగ్రాసనాధి
నాథునిగఁ జేసి రొకనిఁ దన్నయము మీఱు
నంత మొదలింటిమానిసి నుంత ధ్యాన
యోగము నటించి వాక్రుచ్చె నుచితరీతి. ౭

ఉ. మృత్తు జలంబు గల్గునెడ మేకొను బీజవిరోహశక్తి వీ
రుత్తునకు న్వలెన్ శ్రుతమురాఢి సమభ్యసనమ్ము దోడుగా
నెత్తి కవిత్వతత్త్వమున కెల్ల నిదానతఁ బేర్చి బోధసం
పత్తిఁ దలిర్చుచున్న ప్రతిభాసురభూలత నాశ్రయించెదన్. ౮

గీ. అంతఁ గొందఱు పృచ్ఛకు లెంత నుండి
వృత్తములు విషయమ్ములు వివిధములుగ
నడిగి వ్రాసికొనం జెప్పఁ దొడఁగె నాతఁ
డాశుకవనమ్ము నొక్కొక యంశ మోమి. ౯

గీ. రాజు మంత్రియు నొంటె తురంగమమ్ము
సేనిక పదాతు లని బొమ్మ లిన్ని తెచ్చి
గడులు గీచిన పలకపై నిడి ముదమున
నొక్కరులు వాని నాడించి రొక్క యాట. ౧౦

ఆ. ఒక్క రసికవర్యుఁ డొక్క పొత్తము విప్పి
యర్థ మతఁడు నొడువ నర్థిఁ జదివెఁ

బిడుగుగములు దొరలు వడువునఁ బద్దెముల్
పాపజేని భాష్యఫక్కిఁ గొని. ౧౧

క. ఘనుఁ డొకఁ డచ్చటఁ బడవల
సిన యక్కర మొకఁడొకఁడు నిషేధించుచు నా
తనివలనఁ దన మదికి న
చ్చిన కృతిఁ జెప్పించుకొనె విశేషప్రౌఢిన్. ౧౨

శా. అత్యంతార్థనిగూఢపద్య మొకఁ డేకై కాతురాన్వాత్తసం
ఖ్యాఽత్యక్తంబుగ వ్రాసి చీటులగమి న్వ్యాలోలముం జేయుచున్
వ్యత్యాసమ్ముగఁ జూపి డాచుకొనుచు న్వచ్చె న్మఱొక్కం డతం
డత్యంతాత్మధృతిం దదుల్లిఖితపద్యమ్ము న్వకాణింపఁగన్. ౧౩

గీ. విషయవిప్రతిషేధసంవిద్ధబుద్ధి
యగుచు నతఁ డున్నతఱి కొక్క యయ్యె యప్పు
డపుడు జేగంట వాయించు నదియు లెక్క
వెట్టి యాతండు సెప్పెడునట్టి పిదప. ౧౪

మ. వినవయ్యా త్రిపురంబు లొంది దితిభూవీరుల్ త్రిలోకంబులన్
మననీకుండఁ గలంప దుర్జయుల న మ్మాయావులం గెల్వ మే
రునగంబు న్విలుఁ జేసి నాగగుణ మారోపించి సంధించు నీ
"శున క మ్మయ్యెను విష్ణుదేవుఁ డహహా చోద్యమ్ముగా నత్తఱిన్."

గీ. ఏవమాదిసమస్యలు నెవియొ మాట
లడుగడుగునందుఁ బన్నుచు నన్యుఁ డతని
వ్యగ్రు నొనరించె నదియు నర్థ్యంబ యుండు
నంగ మప్రస్తుతప్రశంసాహ్వయ మది. ౧౬

క. అనువరి లేఖకుఁ డొక్కం
డనూనరస ముప్పతిల్ల నల్లు మనఘు! నీ
కనిన వినిన కథ యొక్కటి
యన నాకసపుం బురాణ మాతఁడు విప్పెన్. ౧౭

## ఆ కా శ పు రా ణ ము

ఉ. క్షమ యన రాదు స్వర్గమును గా దది యేమొ? గిరీంద్రశృంగమో?
హిమకరు మందిరాంతరమొ? హేమమణిస్థగితస్థలాచిత
మ్మమలసుధామయావసథ మై తనరారుడు నట్టిచోట ని
ల్చి మెఱయు చంచలాలతల లీలఁ దలిర్చిరి కొంద ఱంగనల్. ౧౮

గీ. వెల్లు వెటిటతట మ్మది వేల్పుగిడ్డి
నెమరు వేయుచు నచ్చోట నిలిచి వ్రాలిచెఁ
గల్పవృక్షకృతచ్ఛాయ గాఁ దలఁచెద
వాన యెండయు బాధింప వా నవలల. ౧౯

సీ. తమ కులుకులు లతాప్రమద లనుకరింపఁ
గేలిలోలలు వాని కేలు తెనసి
తమ విహారము దోహద మగమ్ములకుఁ గాఁగ
ననబోండ్లు విచ్చిన ననలఁ గోసి
తమ మేల నదిక విద్రుమసంపదలు గూర్పఁ
గ్రీడావతులు జలక్రీడ లాడి
తమ పాటు పొమ్ముల గమికి నందము దేన
లంకారచతుర లలంకరించి

వానవక్త్రైన ననవిల్తు సూనశరము
లో? మెఱుంగారు బంగారుతో మలచుచు
వలపు లదికిన బొమ్మలో? వామనయన
లచటఁ బులు లేని ముత్తెము లన వెలసిరి. ౨౦

గీ. అందఱును నొక్కవిధ మైన యంద మంది
యిందుబింబమునకుఁ దెల్వి నీయఁ జాలి
జాలువాఱు విలాసహాసముల తేట
కొల్లగాఁ గొల్వు దీర్చి రా కోమల గములు. ౨౧

గీ. కులుకు కులుకు రసాసార మొలుకుచుండఁ
గలికిమిన్నలు పాడిరి కతలు సెప్పి
రాడిరి కవిత్వరసముల ననుభవించి
రెంచఁగా రాదు హేలావహేల లందు. ౨౨

గీ. వారి తీరు గనుంగొనఁ బంచశరుఁడు
రతియు నిలువేల్పు లనియుఁ దన్మతము వాత్స్యా
యనమహర్షికృతం బని యవగత మవు
రూఢిసిద్ధాంత మర్చ్యతాద్రూప్యసిద్ధి. ౨౩

క. అలినీలకచలు కొందఱు
విలాసముగ నాడుచుండ వీక్షింపంగా
నొలసిన తమకము కొందఱుఁ
గలుకుల ముంపంగ సాగె గవ్వలయాటల్. ౨౪

గీ. అమలపట్టాంశుకాబద్ధ మైన సంపు
టమున సౌవర్ణనామాక్షరములు మెఱయఁ
గ్రొత్త పొత్తం బొకటి చేతఁ గొని లతాంగి
యచ్చటికి వచ్చె నొక్కతె యట్టివేళ. ౨౫

గీ. ఏమి గ్రంథమ్మొ? యిది యని యెల్లవారు
బండ్లగంపకు వలె నెగఁబడిర యర్థిఁ
దరుణి చెప్పెను మనుచరిత్రం బటంచు
వ్రాసిన కవీంద్రుఁ డెవఁ డని వా రడిగిరి. ౨౬

గీ. కృష్ణరాయనృపాస్థానకీర్తిపూర్తి
యాంధ్రకవితాపితామహుఁ డన్న బిరుద
మందెనో నందె నట పేర నల్లసాని
పెద్దనామాత్యుఁ డన్నింటఁ బెద్దయె యట. ౨౭

క. అని యత్తరుణీమణి చె
ప్పిన వినిన యొక ముగ్ధ యనియెఁ బేరధికం బై

మనమున కీ కృతి సరసమ
యను భావముఁ గొల్పుచున్న దన్నులమిన్నా! ౨౮

గీ. అప్పు డొక్కర్తు ప్రౌఢురా లనియె నిట్టు
లతివ! స్థాలీపులాకమర్యాద నెక్క
డైనఁ జదువుము రెండు పద్యములు సూత
మరసమో? సరసమో? యిన్ని యఱపు లేల? ౨౯

ఆ. అనుడు నదియుఁ జదివె నల్లారుముద్దుగాఁ
బలుకుబడికిఁ జిలుక లలులు రాఁగ
మునకుఁ గోకిలములు విన్నసైన స్థాయికి
మురియుచుండ రసము గురియుచుండ. 30

## మ ను చ రి త్ర ము

“శా. ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రత న్నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకలికాశ్రీ దోఁప నం దిందుఁ బో
కెందే నింద్రియము ల్సుఖంబుఁ గను నా యింపే పరబ్రహ్మ “మా
నందో బ్రహ్మ” యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.” 3౧

గీ. ఒకఁ డెవఁడొ విషయానంద మొల్లకున్న
నాప్త లెవరో? బ్రహ్మానంద మందుఁ జేర్చి
పల్కుచున్నట్లు తోఁచెఁ గావ్య మ్మసదృశ
మనుము “శ్యామావికా!” పద్య మన్య మవల. 3౨

ఆ. అనుచు నందఱు విషయమ్ము లన్నియు మాన్చి
యభిముఖముగ శ్రుతు లల్లఁ జాప
లేమ యొకతె సాలు లే యింక నాటాడుఁ
డనియె వినద చదివె న య్యబలయు. 33

“శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచు ల్మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ!

యంచు న్బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పో
మ్మంచు న్ద్రోచెఁ గలంచునే? సతులమాయ ల్ధీరచిత్తంబులన్."

క. అని చదువ నా లతాంగులు
విని విస్మయసంభ్రమప్రవీణత్వరసా
వనిభూతాత్మత నీతఁడు
మన ప్రవరాఖ్యునకు జోడు మానిసి యనిరన్. ౩౫

క. పని పాట లేక తెచ్చితె?
వనితా! యీ పొత్త మీవ పనివడి సకల
మ్మును జదివి బావుకొనఁగాఁ
జనదే? యమబాధ వై రసంబు సెఱిచెదే? ౩౬

వ. అని ముఁన్ను వలదన్న యన్నుమిన్న సిడిముడి వడుటయు. ౩౭

"గీ. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేని జవ్వాది పసఁ గదంబించు నొడలు
గడిగికొని వార్చి ప్రవరుఁడు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి." ౩౮

గీ. అనుచుఁ బకపక నగియె "యీమావిక" యది
తక్కుఁగలవార లెల్ల రాస్తబ్ధ లౌచు
నొకరి మొగ మొక రీక్షించుచుండి రట్టి
తెఱఁగు ప్రత్యక్ష మారసి తీరవలయు. ౩౯

శా. అంతం బంతము రోసము న్నెఱయఁగా నారక్తనేత్రాబ్జ యై
శాంతిం బాసి సఖిత్వముం గొనక విష్టంభాత్తసంరంభసం
క్రాంతస్వేదవివర్ణతాపటుపటాత్కారారవద్దంతదు
ర్దాంతక్షోభపరీతదేహలత యై తన్వంగి తా నిట్లనున్. ౪౦

మ. వికలాత్మా! నినుఁబోటి హీనకును నా వృత్తాంత మీరీతి గా
నెకసక్కెం బొనరింపఁ బాలువడెనే? హేలావిలాసంబులన్

సుకలాప్రౌఢిమఁ జూపి మిండని పదస్థుం జేసి శృంగారభం
గికిఁ గ్రొత్తందన మీయఁ గాక యివి కల్కీ! నాకు నై నేర్చితే? ౪౧
మ. అనుకూలుండవు కాముకుండు పయిపై నాసించి యర్థించి వి
న్నను వెల్లం గృతకృత్య మై వెలుఁగు సందర్భమ్ముతో నేలినం
జను, నీవే కృతపుణ్య వై మనెదు లే చాల్చాలు నాబోటి కా
చనవు ల్లేమికి నింతగాఁ దగునె? నీచా! చప్పటు ల్గొట్టుటల్. ౪౨
గీ. నాదు కథ కించుమించుగా నీదుకథయు
నున్న బాగగు విపరీతయోగయుక్తిఁ
బుడమిలోఁ దోఁచి వలవని పురుషు వలచి
దేవభూయం బెడలి పాట్లు నీవుఁ బడుము. ౪౩
ఆ. అని శపించుదాని నాగి వేరో ర్తనె
నతడు గూర్చుఁగాక యతివ కొకటఁ
బడతి సుఖరసం బుపాయాంతరమ్మున
వానివలనఁ జెందవలయు నింక. ౪౪
వ. నీ చెప్పిన విపరీతయోగంబు నామధేయసంగత మై హృద్యం బగుఁ
గాక. ౪౫
ఆ. ఇట్లు పుడమి సుఖము లెల్లయుఁ దనయవి
గా మెలంగి పిదపఁ గాంత మరల
నతఁడు తన మొగర్పు నరిగిన మఱునాఁడ
మరలఁ గలియు దివ్యమహిళ యగుచు. ౪౬
ఆ. అదియు నిదియు వినియు నల్లాడుము ద్దైన
యాననంబు దీనతాకరముగ
వడఁకు వేఁడి యూర్పు వై నర్ణ్య మొదవ యా
మావికాఖ్య వివశభావ యయ్యె. ౪౭
శా. అప్పుడు చుట్ల నున్న సఖు లాత్మలు నొచ్చిన నవ్వరూధినిం
దప్పక చూచి యి ట్లనిరి న్యాయమె? యి ట్లపరాధ మెద్దియుం

జొప్పడకున్నదాని మన సోదరి నీ దరి లేని సంభ్రమం
దిప్పగిదిం బడం దిగిచి తీవ కదా కడు నేర్తు విమ్మెయిన్. ౪౮

శా. నీచారిత్రము నంగడి న్విలుచు వానిం దత్కవి న్వీడి నీ
నీచారంభము పాలు గాక యటు ని న్నిందాస్పదం జేసి స్వీ
యాచారంబును బ్రోచికొన్న ప్రవరాఖ్యాకు న్విసర్జించి యి
ట్లీ చంద్రానన లోకు వైనఁ గదె తన్వీ! పూని తీ చందమున్. ౪౯

క. అప్పటి యాకృతి కన్నను
నిప్పటి యీకృతి మఱింత యెసకం బెసఁగెన్
దప్పిచనెఁ బొమ్మ ని న్నే
మప్పా! యే మని శపింతు మల్పంబునకున్? ౫౦

గీ. చేయునపు డెవ్వ రే మని చెప్పికొందు
రో? యను విమర్శ ముండిన నొప్పుఁ గాని
చేసితిని నేను నీ వేల చెప్పికొంటి?
వనుచు నెందఱి నో ర్మూయ నౌనొ చెపుమ. ౫౧

శా. ఆర్జింపందగునే? మహాదురిత మి ట్లబ్జాక్షి! పా ల్ద్రావుచో
మార్జాలంబులు కన్ను మూసికొను న న్మర్యాద గన్పట్టె నీ
దౌర్జన్యంబున కొగ్లు దుఃఖపడుటే ధర్మంబొ? యీపాటి నీ
కర్జంబు ల్సభ లాడిపోసికొన నింక న్మాన మెం దుండునో? ౫౨

గీ. "అంగ! గుమ్మడికాయల దొంగ" యనెడు
పల్కు వినవైన బుజములపైనఁ గేలు
సాచి వెదుకంగఁ జొచ్చిన చపలుఁ బోలి
తేమనంగల మకట ని న్నింతదాని? ౫౩

ఆ. అనుచుఁ జిన్నవోయి యంతర్ధి నెనసిరి
పూవుఁబోఁడు లపుడు మొగము జేవు
రింపఁ గోపన మది ప్రిదులఁ బశ్చాత్తాప
మెనసి లేచిపోయె నెచటికేని. ౫౪

అ. అని మహాద్భుతముగ నాశుకవిత్వమ్ము
నిట్టు లల్లు నక్కవీంద్రు ప్రతిభ
నెల్లవారు మెచ్చి రెవ్వరో? యొక రిర్ష్య
రాత్మగాథ యేమొ? యని యులికిరి. ౫౫

క. మును వర్ణించిన విషయము
లెనిమిదిటఁ గొంత యింత యేనిఁ గలుగ దా
ఘనకవి యష్టవధాన
మ్మనన్యసామాన్య మిట్టు లవసిత మయ్యెన్. ౫౬

శా. ఆయగ్రాసననాథుఁ డిట్లనియె నాహా యీ వధానక్రమం
బేయూళ్లం గనఁబోము మానవునిఁ గా నీ భవ్యు నూహింపరా
దే యే వాదము లే వధానివరుతో నేవారికిం గల్గునో?
న్యాయం బప్పుడు చెప్ప నిల్పుదురు విద్యాయుక్తు నగ్రస్థుఁగాన్. ౫౭

గీ. పృచ్ఛకుఁడె సంతసింప నే విధము గలుగ
నవధానమ్ము లేకుండ నది యొనర్చు
వానిసభయందు నధిపతిత్వమ్ముఁ గొనియుఁ
బీరమర్దుఁడ యగుఁగాదె పెద్ద యన్న. ౫౮

ఉ. విన్నప మొం డొనర్చెదను విజ్ఞులు శ్రద్ధగఁ జిత్తగింపుఁ డీ
యున్న కలాసమూహము మహోన్నతిఁ గూర్చెడు జ్ఞాన మీయఁగా
నెన్నఁబడెం జుమీ యెవరి కెయ్యది నేర్చుకొనంగ ముఖ్యమో?
యన్నెతిఁ గన్గొన న్వలయు నక్కట విద్దెలు రద్దికోసమా? ౫౯

ఆ. చుట్టుబొట్టు వొదివి సుమహార్థమును దాచి
పెట్టినట్టు లెందు విజ్ఞు లెల్ల
వారి నాఁకగొనఁగ వర్ణ్యము ల్వర్ణింత్రు
బోధ్యమెల్ల వ్యంగ్యముగ నమర్చి. ౬౦

మ. అనుచు న్నాయకుఁ డందియిచ్చు ధన మన్వర్థంబు గాఁ జేసి త
జ్జనపాళు ల్కరతాడనంబు లెసఁగ న్స్వప్రాభవం బెన్నఁగాఁ

జనియె స్త్రీయులతో వధాని నిజవాంఛానుబంధంబుగా
మును తర్వాత సమస్తు లేగిరి మహామోదానుభూతాత్ము లై. ౬౧

వ. అను కథకు ననంతరకథ నే మర్థించుటయు— ౬౨

గీ. చెన్న కేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహి సమర్పిత మైన యామావికఁ గృతిఁ
బ్రచిత మైనది యేనవు ప్రకరణ మిది. ౬౩

గీ. తాడేపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిటు. ౬౪

శ్రీ శివాయ గురవే నమః

# యామావిక

## షష్ఠ ప్రకరణము

ఉ. తుచ్ఛసుఖంబులం దవిలి దోసము నాక గొనంబు నాక యా
త్మేచ్ఛఁ గడంగి క్రౌర్యమున కింతయు జంకని లోకమందు న
త్యచ్ఛనిజప్రకారము పరాపరపక్షము లేర్పరింప స
త్యచ్ఛవికిం దలం బొసఁగు నప్పరమేశ్వరశక్తిఁ గొల్చెదన్.

* * *

క. శ్రీసంభృతాక్ష్యపాంగా!
భాసురసర్వాంగ! చంద్రపట్టణసంగా!
స్వాసంగాభంగకరో
ల్లాసాఽవామస్థజర్యాలక్ష్మ్యనుషంగా!

గీ. చెన్నకేశవదేవేశ! చిత్తగించు
చుంటివా? వాసుదేవాఖ్యసూరి శ్రుతులఁ
బోసిన కథారసంబె మన్ముఖవివృతము
స్వారసమ్మై నిన్నుఁ జెందుఁ గావ్యప్రసక్తి.

ఉ. నిద్దుర లేచి నీడముల నిక్కి శిశూత్కర మాదరించి యా
వద్దినచర్యకై ఘనరవం బెసఁగ న్విహరించు పుల్గులం
దద్దయుఁ గాంచి సత్క్రియలఁ దత్సమయార్హములం బొనర్చి సం
పద్దశ వారివారిపనిపాటులకై నరు లేగు నత్తఱిన్.

### రాజప్రతినిధి యాస్థానమున నొక్కని కార్యనివేదనము

క. ప్రాకారము నొప్పును ర
త్నాకరకుడ్యప్రశస్తి హైమస్తంభ

శ్రీకరభావము నను న
వ్యాకారము మెఱయు సౌధమం దొకచోటన్. ౪

తొలుత బాడసూపి యొక్కఁడు తలుపు దెఱచి
సంస్కరించి మహాసనచయ మమర్చె
నప్పుడప్పుడె ప్రతిహారి ద్వారి మెలసె
న్యాయవాదులు లేఖకు లాది నెఱయ. ౫

తా ధరించిన వేసంబ ధర్మదేవ
పదవి రూపింప లలితాతపత్ర మెసఁగ
నొక్క యధికారి యేతెంచి యున్నతాస
నమునఁ గూర్చుండె నందఱి నతులు గొనుచు. ౬

వ. అంత ద్వాస్థుండు కార్యవిజ్ఞప్తులఁ బిలుచుటయు దుఃఖాలుతాకృతి యగు నొక కృతి చేర వచ్చిన వాని యవసరం బధికారి ప్రసంగించుటయు. ౭

ఉ. దానికి మానసం బెరియఁ దల్లడమందుచుఁ బల్కెఁ జొచ్చె నా
దీనుఁడు ధీనిధాన! విను దృష్టుఁ డొకండు మదీయగేహమం
దానతుఁ డట్లు సేవ తన యన్నముమాత్ర కొనర్పఁ బూనుఁడున్
దానికి నియ్యకొన్నఁ గలదానికి మోసము దెచ్చె నయ్యయో. ౮

గీ. చీర లుదికెద నని పూని చిన్నవాని
గెడపి యగ్గెడఁ బెట్టె ని ల్విడిచిపోవఁ
డట్టె, యింకెన్ని ప్రాణము లపహరించు
నో? యమునిఁ జూచినట్ల మా కొదవె భీతి. ౯

క. ఆ నిసువుపోవ నీక నే
లా? నా యసువు లిపి యయ్యలారా! యయ్యో
పోనడిచినఁ బోవఁ డెటో
మానెంజిలి వాఁపుఁడయ్య మానితశక్తిన్. ౧౦

క. అని పొగులుచున్న కన్నతెఁ
గని యితరులతోడ ననియెఁ గన్నా కేత
ద్వనితాశ్రయ మిది యాకె
న్మనను పిలువుం డనుచుఁ జిత్తమున దయ మెఱయన్. ౧౧

వ. నియమితుఁడు పిలుచుటయు:— ౧౨

ఉ. క్రొవలు సంచలింప వెడ క్రొవ్వెద వీడ్వడి మేనియొప్పు నా
హోవక కప్ప నశ్రుజలము ల్గను లూరఁగఁ జన్నుగప్పు దు
చ్ఛావచ మై తొఱంగ నెద సాచినకేల్గవ బాదుకొంచు దుః
ఖావహమూర్తి యై కరటియాన బిటీలున వచ్చె వచ్చినన్. ౧౩

క. అధికారి శోకరసమున
నధిగతుఁ డై పలికె నిట్టు లక్కా! దుఃఖో
దధి నట్టు లునిచి చెపుమా
యధీనుచెయిదంబు వాని నడఁతు నటంచున్. ౧౪

సీ. ఏమి చెప్పను? నాయనా! యింతబిడ్డ
క్రమిఁకొన్నది గా యిది మేలు కలదె?
వానిఁ జంపినమాత్ర మెవ్వాని నొసట
నెట్టి విధి వ్రాలు కలవో? ము న్నట్టు లగును. ౧౫

చ. అన విని న్యాయవాది లలనా! యిట నేడువరాదు మాని మా
కును దగు నుత్తరం బిడుము కొంకక యెవ్వఁ? డేఁ కేమి సేసె? నె
వ్వని? నెపు? డెట్టు? లెచ్చటి? భవత్స్థితి యెట్టిది? ధర్మ మూఁది దే
వునియెదుట న్నిజంబు వెలిఁబుచ్చుము నావుడు నాతి నెవ్వగన్. ౧౬

చ. అడఁచిన నాగునే? యడ లటంచును గన్నుల నొత్తికొంచు రా
ల్పడు నెలుఁ గేర్పడం జివురు పట్టి దురాత్ముఁడు ప్రాచి సంజయు
ప్పడు వనవాపి ఉాలిపయి మోదుచు వస్త్రచయమ్ముతోఁ గసిం
గెడపెఁ గటా తలంచిన మొగి న్సకలాంగము లేడ్పు కాల్పదే? ౧౭

వ. అని రోదనపరాయణ యవు డాని నడిగి బాలుశవమ్ము దెప్పించి
విమర్శించి తదుదిత మెల్ల నమ్మి యమ్మానిసిఁ బట్టి తెప్పించిన
యనంతరమున— ౧౮

న్యాయవాది నేర మొనర్చినవానిఁ బ్రశ్నించుట

చ. కినుక యెలర్చు కన్గవ వకీలు గనుంగొని వానివల్లఁ గ్ర
మ్మన నన్నృతమ్ము వల్కని ప్రమాణపుఁబల్కడలించి వానితో
ననఘ మదీయవాక్యముల కౌ నెరి నుత్తర మిమ్మనంగ న
ప్పని కతఁ డొప్పె నిర్భర వివాదము సొప్పడె నివ్విధంబునన్. ౧౯

సీ. ఎఱుఁగుదువే వీరి? నేరీతిఁ బరిచయం?
బెఱుఁగనే? వీరింట నిమ్ముకొంటిఁ
బాప మెవ్వఁడొ? వీరి పాపని మడియించె
నటు చేసెనట దేవుఁ డంతకుండు
డానికిఁ గారణంబేనిఁ గల్గదుకదా?
చాలదే? ప్రారబ్ధసంచయంబ
యద్దాని రూపంబె యనవగతం బయ్యె
నిది యెఱిఁగినవార లది యెఱుఁగరె?
అదియ మాకిప్డు తెలియంగ నవసరంబు
పృచ్ఛసేయుఁడు మా యమ్మ యెఱుఁగు నింత
నీవు మూల మ్మనుచుఁ జెప్పె నెలఁతమిన్న
పొలఁతిప ల్కిచ్చట నొకింత పొల్లువోయె. ౨౦

క. నీ యెఱిఁగినంతవట్టును
న్యాయంబుగఁ జెప్పు మాపె నడిగెద మదియున్,
నా యెఱిఁగినంత సెప్పినఁ
బోయవె సంసారకర్మబంధము లెల్లన్? –

క. నీ పే రెయ్యది? యూ రేది?
నీపెతరుల పెంపు వీరి నెయ్యము సెప్పుమా

యా పగిది చెప్పఁ జొప్పడు
నే? పాదయుం గదలుఁ దీగ నించుక లాగన్. ౨౨

గీ. అనెడు సల్లాపమును విని యంతవట్టుఁ
గావలయుఁ జెప్పు మని యధికారి వలుక
నెలయు చిఱునగ వాస్యమ్ము నలమికొనఁగ
నిజము దెల్పఁదొడంగె నా నేటుకాఁడు. ౨౩

ఒక కథ

క. ఆనందశర్మ యనఁగా
నానందనిధాన మగుచు నాత్మస్థితిమై
నా నందనచరులకు నెన
నా నందముఁ జెందు సౌమ్యనగరమునందున్. ౨౪

చ. అనృతము నాల్కఁ జేర దెపు డందదు చిత్త మనర్థజాతికిన్
వినయము వృద్ధసేవయు నవీనము లాతత మైన సంస్కృతిం
దన కొక చింత లేదు సిరి తన్నుఁ దొఱంగ దొకప్డు శాశ్వతం
బనుపమ మాద్య మైన మహ మాతనిసొమ్మతఁ డెంత ధన్యుఁడో? 

గీ. అమ్మలక్కల కఱపుల కగ్గ మాట
వృద్ధసేవయు వినయంబు వెరవు లేక
ప్రాక్తనార్జితసుకృతలవంబువలన
వాని సాని యనఁగ నొఁ జాన యొర్తు. ౨౬

క. భూతిని సంతానము దను
భూతి యొకం డాపె కనుభూతం బయ్యెన్
గొటఁకమున నొకరాతిరి
నాతి వలుకు నేకతంబ నాథునితోడన్. ౨౭

ఆ. ప్రాణనాథ! సర్వవైభవమ్ములు నాకుఁ
గలవు యుష్మదీయకరుణ వెరయఁ

బెద్దకాల మయ్యెఁ బెతరుల బుణ మొండు
ననఘ! తీర్ప నోమ నైతిఁగాక. ౨౯

ఉ నెక్కొని చూచుచుండఁగనె నిన్నటి మొన్నటి చిన్నికన్నెలుం
గ్రక్కునఁ జెక్కుటెల్విఁ గనఁ గాంచి సుఖాంచితలై శిశూత్కరం
బక్కునఁ జేర్చికొంచు మురియం గనుచుండఁగఁ బోయెఁ గాల మి
ట్లక్కట యెక్కుడౌ ఫలము లల్పకృతంబుల కెట్టు లబ్బెడున్?

శా. శ్రీశైలేశ్వరుఁ బాండురంగవిభు వాసిం గొల్చితిన్ గ్రామదే
వీశక్తిం బురికొల్పి పుట్టకు ధను ల్వేమారు లర్పించితిన్
ధీశార్యమ్మునఁ బీర్లకే నెరగితిన్ హ్రీ లేక దాసర్ల కా
యాశం బాసెము వెట్టితి న్మనకు భాగ్యం బెందు లేదక్కటా! 3౦

ఉ. ఏ మని సెప్పుదాన? మదధీశ్వర! యీ సిరు లేల? నిచ్చ లీ
నేమము లేల? గేహముల నిల్కడ లేల? మహంబు లేల? యే
కామము లేల? రత్నకలికానవహారము లేల? మీ కొలం
బోమఁగఁ జాలువాని సుతు నొక్కనిఁ గానకయున్న నా కికన్. 3౧

గీ. అని పలవరించుచున్న య య్యలరుఁబోఁడిఁ
జింతఁ గలఁగని యెడఁద నొక్కింత గాంచి
లేనగవు మోము నలరింప లీల నిట్టు
లనియె బోధాత్మకుం డగు న ప్పూరుషుఁడు. 3౨

మ. సుదతీ! తుచ్ఛపుసంసృతి న్సఖు లరు లూసను ప్రియు ల్బంధు ల్
మదితో నయ్యయి కృత్యము ల్నెరపు ధీమంతు ల్గనంబోవ ర
స్మదధీనం బవు తెల్వి ఘోరతరసంసారాబ్ధిమగ్నుల్ జడుల్
సుదతు ల్గావరు కావ రాత్మజులు సంక్షోభంబునం బొందుచున్. 33

క. నా మది నిశ్చిత మెయ్యది
ధీమదుపాస్యమ్మ నైన తెలుఁ గది సంసా
రామృతము దాని నెనసిన
చో మానిని! మాను నఖిలశోకచయంబుల్. 3౪

సీ. ముట్టి పీడినయేని ముగ్ధ నివృత్తి సే
వలు సేయు నెపు డెడబాటు లేక
తన యిచ్చ కడ్డ మైనను విద్య యనుకూలతు
రొదవిన గేహంబు నుద్ధరించుఁ
బుట్టి గిట్టినయేని బోధపుత్రునిఁ గన్న
వారికి లేదు సంసారభీతి
యిల యెల్లఁ గోలుపోయిన యేని వస్తువి
చారు మైత్రి నెసంగు జనులె సుకృతు
లంతరింద్రియబాధకు లైనవారి
నార్వుర జయించువారె నిరస్తశత్రు
లతివ! యీ సంసృతి న్సుఖ మందువారె
యుగ్రసంసారబంధంబు లూడ్చువారు. 37

క. ఆ సంసారమ్మున కై
నా సర్వంబైన శక్తి నమ్మి పనిచితిన్
నీ సుకృత మట్ల చేయుము
వాసికి నెక్కెదవు దేవవనితలకన్నన్. 38

క. వెండియు నిట్లను దలఁగద
పెండిలియైనపుడుగాని పిచ్చి వినుము నీ
కుండె నుపాయం బొకఁ డో
యండజయానా! మదిఁ గొను మది యేమన్నన్. 39

ఉ. భూమిని! రేప యీ పురికి వచ్చెడు నొక్కఁడు సిద్ధయోగి నీ
వా మహాత్మునిఁ గొల్వ మతఁ డన్యము నొల్లఁడు భక్తిగమ్యుఁ డిం
పొ మతి వానికి న్సలుపు నట్టి సపర్యయె చాలు సంతతుల్
కామములుం బ్రబోధ మిడఁ గాంచుము తద్దయఁ బుత్రరత్నమున్.

క. నా విని మెపు డెపు డనుచుం
బావనుఁ డప్పు వానివలనఁ బలుమరు వినుచున్

దా వేఁకువతఱి మేల్కానె
నావరకు న్నిదుర సెందనట్టి కనులతోఁ. ౩౯

సీ. తొలుత సుస్నాత యై ధూపధూమమ్మున
నెత్తావిఁ గను కురు ల్నిగనిగ మన
లబ్ధహారిద్రమ్ముఁ లత్తుక పొత్తున
నడుగుకెందమ్ములు బెడఁగు లొలుకఁ
బ్రాప్తపటీరము ప్రకటమణీహార
ముల నెలపాలిండ్లు కలుము లీన
ననుమతాలంకృతు లంశుకపర్యాప్తి
నంగకంబులు మేలి హంగు నెనయఁ
జతురలంకారహితతనూలతిక యగుచుఁ
గనకపుంబల్లెరమ్మునఁ గాన్క లొసఁగఁ
గ్రొత్తరతనంబుల నమర్చి ప్రొద్దు వొడువ
కుండ మునిఁ గనఁ గోరుచు నుండె నువిద. ౪౦

గీ. వచ్చె నంతకుఁ బిడికెఁడు బిచ్చ మనుచు
నెక్కడనొ? విన్న యెలుఁగున కిక్కడఁ గన
వచ్చు రూపుగ నొక గోచిపాతరాయఁ
డాతనికి సర్వధని కెద్ది యర్థ్య మిందు? ౪౧

ఉ. ఆసరసీరుహాక్షియు నుపాయనము ల్గొని యేగి మేలి యు
ల్లాసము లోచనాంతముల లాస్యము సేయఁగ వానినాథునిన్
మోసలఁ గాంచి మ్రొక్కి తనపోడిమి నచ్చెరు వందునట్లుగాఁ
జేసెద నంచు నున్నపుడ సిద్ధుఁడు క్రుద్ధకరాళవక్త్రుఁడై. ౪౨

శా. ఓసీ! హీనవిధస్వభావ! వశమానో? మానిచిత్తంబు పె
ల్రాస ల్గొల్పెదు నీకు నిప్పటికి ల గ్గయ్యెంజుమీ పొమ్మ నీ
వీసారి ట్లొనర్చితేని మగువా! యీ నా యుపానద్యుగిన్
దోసంబుం బెడఁబాతు నంచు మది నేదో? తా విమర్శించుచున్.

ఉ. ఇతఁడు ప్రాప్తబోధుఁడు మహాత్ముఁడు నీ మగఁ డాత్మయందు న
న్నేతదభీప్సితార్థమున నింతకు ధ్యాన మొనర్చెఁ గాన నీ
కాతతబోధుఁ డౌ కొడుకు నక్కట యీ వలసెం దలోదరీ!
ప్రీతికి ముష్టిధాన్య మది బిచ్చము వెట్టుము కాన్క లేటికిన్? ౪౪

గీ. అనుచు భర్త్సింప నా భీరు వతిభయమునఁ
బెట్టెఁ బిడికెఁడు బియ్యమ్ము బిచ్చ మపుడె
వాఁడు సొరకాయబుఱ్ఱలో భసిత మొసఁగెఁ
ద్రావు మిది నీటఁ గలిపి సత్వరమ యనియె. ౪౫

క. ఈ గుట్టు సెప్పకుండుము
లోఁగొని యెవ రడిగిరేని లోలాపాంగీ!
యోగమహితాత్ము నొక్కని
శ్రీగణ్యుఁ గుమారుఁ గాంతు దివ్యచరిత్రున్. ౪౬

క. ఉవిద! మఱి వత్తుఁ బంద్రెం
డవు వత్సరమం దిచటున కాత్మేశుఁ గనన్
భవదాత్మజుఁ జూపింపుము
వివృతము వితథంబు కాదు విట్ఠలు కరుణన్. ౪౭

క. అని పాండురంగనాథునిఁ
గొనియాడుచుఁ బోయె మౌని గొనకొని సతి యి
మ్మును బొందె నిరువుపొరువుల
వనితామణు లల్ల నల్ల వచ్చిరి దరికిన్. ౪౮

గీ. అక్క! చెల్లెల! కోడలా! యత్త! వదినె!
యనుచుఁ గల లేని వరుసల నదుకుకొనుచు
ముసరుకొని కన్ను గీటి మోమోట వెట్టి
యడిగి రంగన లద్దాని యట్టు పుట్టు. ౪౯

క. ఎవ్వం డీ మునితిలకుం
డెవ్విధమునఁ దెలిసె నీకు నీతని మహిమం

బెవ్వరము గోరి తీతని
నివ్వటిలం జేసెనొక్కొ నీ యీప్సితముల్? ౫౦

ఆ. అనిన గోపనీయ మక్కలారా! యిది
కోపదారి తబిసి సైపఁబోఁడు
భద్ర మనుచుఁ గట్టుబా టొనరించెఁబో
దాఁగఁగలదె వార్త తరుణులందు? ౫౧

క. ఈ మునికందువ సెప్పెన్
నే మొఱ వెట్టుకొన రాత్రి నెన రొప్పఁ బ్రియుం
డౌమెయిన నిష్ఠఁ గొలువం
గా మహితుఁ డొసంగె బూదె గరుణామయుఁ డై. ౫౨

గీ. దీని భక్షించినంతనే దివ్యబోధుఁ
డౌ కొడుకు పుట్టునట నాకు నమ్మలార!
యాతఁ డిగ్గెడ కేతెంచునట కనుఁగొన
నింపు మెఱయఁ బండ్రెండవు నేట ననిన. ౫౩

ఉ. దానికి వింతనవ్వు నగి తామరసాయతనేత్ర లెల్ల రో
మానిని! యెంత పిచ్చి? బసుమంబున కెట్లుదయింత్రు బిడ్డ లీ
ధ్యానము మాను మింక ననయంబు నెఱుంగమె యిట్టివారలం
బ్రాణము దీయు దయ్యములు వాయక వెంబడుఁ గొన్ని కామినీ!

చ. తనయుల మాట తథ్య మెదొ? దైవ మెఱుంగు నెదేఁ బిశాచ మి
య్యనువునఁ బూనెనేని నతివా! యది త్రోవఁగ నీకు మాకుఁ జే
తనవునె? లేతదానవు కదా పతియుం దగువాఁడు వేల్పు మీ
కును బ్రజ నీయ నున్నఁ బొసఁగుంజుమి యింతను మించిపోయెనే! ౫౪

క. దైవము వ్రాయని బిడ్డల
నేవిధమున బూదె యిచ్చు? నింత యరయుమీ
మావలనఁ గోప మేలా?
నీ వెరవునఁ జూచికొమ్ము నిర్ణయ మబలా! ౫౫

ఆ. అనుచు నొక్క రొక్క రరిగిరి తరుణులు
భీతి గదుర ముందు వెనుక తోఁచ
కా చలస్వభావ యా బూఁదె నిరసించి
పాదుదొడ్డిలోనఁ బాఱవైచె. ౫౭

క. అది యెల్ల నెమ్మదిం గని
యుదిలపడక భావికార్య మూహించి తదీ
యదయితుఁడు నూరకుండెన్
విదితాత్ముం డెందునేని వెలిఁబడఁడు కదా! ౫౮

శా. ఆ శాపాయుధుఁ డట్లు పోయి సకలక్ష్మాభోగముం జుట్టి పు
ణ్యాశం దీర్థముల న్మునింగి యొకపద్యం బండరాపట్టణా
ధీశుం గానఁగఁ బోవఁగాఁ దొడరి మధ్యేమార్గ మం దొప్పు త
ద్దేశంబుం జొరఁబాఱి తద్గృహపురోదేహళ్యభిప్రాప్తనలిన్. ౫౯

క. నిలఁబడి వనితారత్నమ!
కలితగుణుం డైన కొడుకుఁ గాన్పింపుము నా
నల లలన కలితనంబునఁ
దలవాకిలివద్ద నిలిచి తడబాటుమెయిన్. ౬౦

క. ఇడ్డ యవముష్టి గైకొని
బిడ్డలు పాపలును లేరు వెనఁ బోవయ్యా!
యెడ్డగిలునొక్కొ? వేలుపు
గిడ్డి నొసంగినను మాకుఁ గింభాగ్యలకున్. ౬౧

మ. అని యన్నం దన సంయమంబునకు వైయర్థ్యంబు నూహించి యి
ట్లను మౌనీంద్రుఁడు పెక్కుమాటలివి యేలా? చంచలాపాంగి! నీ
వనృతం బైనది దాఁచిపెట్టి నిజ మున్న ట్లెల్ల వాక్రువ్వ నొ
మును నే నిచ్చిన భస్మ మెన్నఁ డిటులై పోలేద యెవ్వారికిన్. ౬౨

చ. అనునెడ నా తలోదరి స్వయంప్రసృతంబు శరత్వ మేర్పడన్
మునివర! యెన్నఁడేనిఁ గనుమోసలఁ గాంచితిమే? యిదంవిధం

బనుభవ మిట్టిభస్మమున కాత్మజులం గనవయ్యోనేని నిం
కను విధి యేల? స్త్రీపురుషకల్పితకల్పన లేల సృష్టికిన్? ౬౩

ఉ. నావుడు వింతనవ్వు నగి నాతిరో! నీవు వచించినట్టి యా
దేవునితోడ లోకముల తేకువ భస్మముసేయ నోపుఁగా
నీ, వెలిబూడె హీనులకు నీప్సిత మిచ్చునె? నీవు బొంకినన్
బోవునె? తన్మహత్త్వ మని భ్రూకుటిభీకరవక్త్రభాగుఁడై. ౬౪

మ.స్ర. ఇదె భూతానీక మెల్లన్ హృదయ మొకటితా నెట్లు బొంకంగనేర్చున్
విదితంబు ల్వాల్కు నెట్లు న్విధుతపనులతో వేళ దేశంబు సంజల్
పది యేలా? యిట్టిచోటం బలుకఁడె విభుఁ డా పాండురంగాధినాథుం
డదుర నోర్మిదండె?పాపా!హాతనయ వగు నిన్నాత్మయేలా క్షమించున్?

మ.స్ర. పలికింతుం జూడు మంచుం బటపట గొఱికెం బండ్లు మానీంద్రుఁడప్డే
యిలయెల్లం గంప మందెన్ హితము గనకపోయె న్సురానీకచిత్తం
బులు మర్యాదం దొఱంగె న్భువననిధు లటు ల్భూతసంఘాత మోడెన్
విలసిల్లెన్ శూలిమోమా మావెలఁదిభయమునన్విన్ననై మూర్ఛపోయెన్

క. అంతకు నా దంతిగమన
కాంతుం డిరుగేలు మొగిచి కడు డగ్గఱి లో
కాంతకరు నంతకున్ ముని
కాంతుఁ డ్ధ్యానింపఁ జొచ్చె ఘనతరభక్తిన్. ౬౭

సీ. ఎల్లలోకంబుల నేలయించు విట్ఠలే
శ్వరు కరుణార్ద్రంబు వడసినాఁడ
విల కింతకును బాధ లెడలించి సిరి గూర్చి
కడతేర్చు సిద్ధులు గన్నవాఁడ
వాత్మతపశ్శక్తి నల దేవరాయని
యెడఁద కేనియు భీతి నిడెడువాఁడ
వంతరింద్రియముల నదుము మాబోంట్లకుఁ
దలమానికంబ వై తనరినాఁడ

వకట యది యెల్లఁ బొలివోవ యనద యైన
దీని కొఱకు కేల వెచ్చింప దివ్యబోధ
ముఁ గనుంగొను మయ్యా! యీ ముగ్ధల కెటు
బోధ మురు నయ్యా! నాదె తప్పుగదవయ్యా! ౭౮

క. కొమకులు లే రని వగచిన
జనుగా! నీ కర్మ మనక పరితోషముతోఁ
గనుగుట్టు బయలుసేసితి
వెఱఁగను నే నదియ కాదు విను మని కొలువన్. ౭౯

ఉ. దానికిఁ గొంత శాంతిఁ గని తాపసవర్యుఁడు నీ ప్రశాంతియే
ప్రాని ధరిత్రి నిత్వ నని పున్నెము నెంచి నుతించె వాని నా
పై నెటఁ బూఁదె వైచి తని పాయనికిన్కన పృచ్ఛసేయఁగా
నీనముఖంబుతో మదనవతీమణి చూపెను దత్ప్రదేశమున్. ౮౦

క. అట చని మలభూనాథా!
యిటురమ్మని వాని పిలువ నాహితమతి యై
వటువేషమ్మునఁ బటుగతి
నటు పంద్రెండేండ్ల కొలుఁ డై యుదయించెన్. ౮౧

వ. వానిఁ గైకొని యెవ్వానికిఁ జూడరాని వేఁడి వేఁడి వేలుపునట్ల యై వెనుకపడి పుత్రదానం బొనర్పవే యను దాని నీసడించి యంతస్సంజ్ఞ నాతని వీడ్కొని చనిచని పుండరీకాశ్రమంబున నమ్మునిపుండరీక వైరి పుండరీకాక్షు నీక్షించి యొక్క మహారణ్యంబునఁ బ్రవేశించి యంచిత దయుం డై యా బాలునకు లీల మై యోగమార్గంబు లాగమ విధానంబులు దెలిపి వత్సా! భూప్రదక్షిణంబు నేసి పంద్రెండేండ్లకు యోగసిద్ధుండ వగు నిన్నుఁ గానవచ్చెద రానినాఁడు నీవ నన్ను నెమకుపని వూనెదుగాక యని సంకేతించి తనయిచ్చం జని యింతకు రాకున్న సిద్ధిమంతుండ నై యేను నిట వచ్చి యిం దీ విధమ్మున నున్న నా గురువరుం గాంచి వీరింట దాస్యంబు నొప్పుకొని తజతో

జ్ఞానంపుఁ దెరువులు గానిపింపఁజేయ విసివి యీ గట్టివా నన్ను గిట్టింపఁ
బె ట్టాలోచించి. ౭౨

పొత్తిగుడ్డ లోకఁ బ్రోవుగా సమకట్టి
వానిలోన బాలుమేను పేర్చి
యుదుకు మనుచు నీయ నుదికితిఁ బ్రభువులు
సెప్పినట్లు బంట్లు సేయవలదె? ౭౩

అనుచుండం బ్రభువర్యుఁ డిద్ది నిజమేనా? యంచుఁ బ్రశ్నింప నా
ముని చిత్తమ్మునఁ బొక్కి యిట్టులను మోమోటంబు మీ కేల? యే
పను లె ట్లున్నను బాలుఁ జంపు టిది చొప్పా యంచుఁ బ్రశ్నింపుఁ డీ
రన నాతం డటుసేయ నాతఁడు సముద్యత్కోపదీప్తాకృతిక్.	౭౪

ఏ పను లెట్లున్నను సుతు
నేపుడిగింపంగఁ దల్లి కే చనునేర్క్
బాపురె! పెరవారల కది
యోపని పని యొక్కొ? యనుడు నువిద మహోర్తిక్. ౭౫

ఓరి! నీ మచ్చుమాయ మా యొప్పునందె
తప్పువట్టితి వటర! యే తల్లు లైన
బిడ్డలను జంపుకొందురా? వేయు నేల?
భర్త యేటికి నా కట్టి పట్టి వోవ? ౭౬

అని యేడ్వఁ దొడఁగిన నటు ల
యిన సంజీవితు నొనర్చి యిచ్చెద నీ పు
త్రుని నా గురు నా కిమ్మా
పనివినియెద నీకు మ్రొక్కె పల్లవపాణీ! ౭౭

అనుచు వాఁ డనినం గొంత యకట వీఁడు
సచ్చిపోయినవాని నేజాడఁ దెచ్చు
నాయెఁ బోయె నటంచు బడాయి గాని
దేవుఁడా యీతఁ? డని మది దిటవు గాంచి. ౭౮

ఆ. అట్టి భాగ్య మున్న నక్కట రానేల?
యిందులకు నడంపు మింత చింత
గురునిఁ గొను మఖిలము గొనుము సంతసమున
ఋణము దీర్చికొందు నెదియు నొసఁగి. ౭౯

ఆ. అనుడు నెల్లవార లానందముం బొంది
రనియె నధికృతుండు నతనితోడ
వీని మనుపకున్నఁ బూని నీకు జంపింతు
ప్రజ్ఞ సూపి గురునిఁ బడయుమయ్య. ౮౦

క. అని యాతనిచే ముమ్మా
రనిపించి సమస్తజనము లాదృతిఁ జూడన్
మునివరుఁడు పాండురంగే
శుని నెమ్మదిఁ బొడుకొల్పి సొగయిక యెగయన్. ౮౧

బాలఘ్నుఁ డా బాలు బ్రదికించుట

సీ. కారుణ్యరసము పెంపార గారుచునున్న
కనుమొన తవులు చొక్కటము లీనఁ
గైదోయి నేర్చిన కొమున సన్నహాంం
బట్టుసాలువ నడికట్టు గ్రాలఁ
బూలక్రోవల నొప్పు ముందలఁ జొల్లెమ్ము
పై నెమ్మిసికె యొప్పు పంచికొనఁగ
నెలన వ్వొలయు మోవి కలఁ గప్పురాఁబోలు
నెదమానికపు జిరా యొలమి నెనయఁ
దనకుఁ గూరుచువారలఁ గనికరించు
పూన్కి కొక్కింత విశ్రాంతి వొరయకుండ
నిందుకొల్వున నిలిచిన పుండరీకు
భాగధేయంబ యింక నా పాలి దిక్కు. ౮౨

చ. అల తొలికాఱు మేలి మొయి లా యన నొప్పవు మేనియందె మొ
క్కలము తమంబు సేరిచి జగాజిగి జిమ్మనఁ జిమ్ము మోవి మో
సల రజ ముంచి చిత్తమున సత్వము కన్గవ జాలువాఱఁ దె
క్కలి దొలఁగించి భక్తతతిఁ గాచు జగన్నుతు నాశ్రయించెదన్. ౮౩

ఉ. పుట్టితి నమ్మ యయ్య యను పోడిమి లేకయె భాగ్యయోగ్యతన్
బట్టితి సద్గురూత్తముని పాదసరోజము లాఁచికొంటి నే
పుట్టును నట్టు వాపు పరిపూర్ణ భవత్కరుణార్ణవంబులో
నెట్టనఁ గొన్ని బిందువులు నిర్మలసంస్థితి విట్ఠలుప్రభూ! ౮౪

చ. గురుఋణ మొండు దీర్చు పని గోరి పౌనర్చితి నింత యింతకుం
బరిణతి నీమెయి న్వలసె భారము నీపయి మోపినాఁడ నీ
గరితకుఁ గూర్చు నర్భకుఁడు క్రమ్మఱ జీవితుఁ డైనఁ జాలు నీ
కరుణ కసాధ్య మెయ్యదియుఁ గల్గదు గా యిల విట్ఠలేశ్వరా! ౮౫

చ. నిరతము నీదు పాదనలినీజమునం దనివొందు నాత్మబం
భరము గురూత్తముం దలఁచుపట్టున నూరక యున్న దోస మొం
డరయక నీకుమారకుఁ జిరాయువుఁ జేయఁగ వేడుకొంటి నా
దొర! యిది యెంత నీకుఁ? బ్రణతు ల్పది వే లివె విట్ఠలేశ్వరా! ౮౬

క. అని కొనియాడు మెయిన నె
మ్మనము పరవసంబు నెనయ మౌనివరునకుం
గనుదమ్ములు మొగిడెం బస
దన మెనసె న్నొసట నతని దైవము మెచ్చన్. ౮౭

గీ. దేవతల పూలవాన మైదీవ వొదువ
నాడి రచ్చరలేమ లాహరిపదమున
నారదుఁడు వాడె వాని విన్నాణ మెల్ల
బ్రతికి తన తల్లిదరిఁ జేరె బాలకుండు. ౮౮

ఉ. ఉల్లము పల్లవింపఁ బ్రమదోదధిఁ దోఁగిరి తొంటివారు మే
నెల్లఁ జెమర్ప భీతిమెయి నేమియుఁ బల్కక నాథుఁ డుండ వి

ద్యుల్లలితాంగి బెగ్గిలియుఁ దోపఁగనీక మహాత్ములార! యీఁ
జెల్లునె నాకు నాథు నరచేతికి స్వర్గము వచ్చెనేనియున్? ౭౯

క. మునుకొని సకలార్థము వో
యిన నైనను బుత్రుఁ గాచు టె మ్మగుఁగానీ
మునిమాయఁ బడితి మకటా
తనువు సగము వీడనవునె? తనుజాతునకై. ౮౦

## అధికారి తీర్పు

వ. అని తప్పఁబలుకు నప్పుడతి నొప్పరికించి యా ప్రభువు ధర్మదేవత నెద నెంచి సభ్యులఁ గాంచి, విరించికల్పుఁ డి మ్మునికల్పు నీ జల్పాక కైతవమ్మున నిజతల్పమునకుఁ దార్చుకొనియె. మాయావినులకు దుస్సాధం బేయది? ఇంక నిమ్మానియు లక్ష్మీలాలనకుతూహలమో? లలనావిలాసపాశశతమో? మోహమో? మదమో? మందో? మాంకో? మాయయో? మంత్రంబో? లోఁగొన దీని కైవస మయ్యె. విషయ రసవాహిని వీతరాగధరాధరమ్ములనైన నువ్వెత్తుగొనక మానదు కదా? ఈ నిసువుజడదారి నొడివెడువడువు కడు నక్కజం బైనను నిజం బనక తప్పదు. వీని మృతసంజీవనశక్తియే తన్మూలము. అన్నృత వాదుల కిట్టి విద్యలు ఫలింపవు. గురుకార్యమున కెంతలెంత ప్రైనఁ బడు నంతేవాసుల మనము వినియుండలేదా? యిప్పటి యీయప్ప పలుకు లటు లుంచి మొదలి పంతంబును బాలముని చింతితంబు నేకార్థ పర్యవసన్నంబు లని మన మెఱింగిన విధంబ. యిట్టిచో గతాసువు నాగతాసువు నొనరించి మించిన నితనికి గురువరు సమర్పించి యీతరుణి యనృణ గావలయు. కాకున్నఁ బ్రభుశక్తియ యుక్తమ్ము సాధించెడు మని యూరకుండె నంత— ౮౧

బాలయోగి భోగి యగు గురుఁ గొని చనుట

గీ. వేలుపుల పూలజడి విన్ను విప్రుల ముంచె
దెసలు తెలివొందె నప్పటి తెఱగు సూచి
నెలఁత యెడ దోఁగ నించెఁ గన్నీరుదార
తబిసి తనుఁ దాన మఱచి సంస్తబ్ధుఁ డయ్యె. ౯౨

సీ. జల్తారు జిలుఁగు పచ్చడము పట్టునఁ జించి
గోచిపాత యొసంగె గునిసి మొదట
గమకించు సంగరాగము జోక మగిడించి
యలదించె వెలిబూదె నలరు మేన
ముద్దుపద్దుల మూట ముచ్చటముడి వీడ్చి
వెడజడ ల్వేనించె బిరుసు దోఁప
వేడుక కెందమ్మి వెడలించి కెంగేల
సొరకాయబుఱ్ఱ నిష్ఠురతఁ గూర్చెఁ
గోరుముష్టికి నడిపించె గురుని శిష్యుఁ
డధికృతు నియోగ మెనసి యనంతరంబ
యయిన రసరాగరంజిత మైన మనసు
మాత్ర మతనికి నింతకు మగుడునొక్కొ? ౯౩

మ. తొలుతన్ యోగివరేణ్యుఁ డై మెఱసి యస్తోకప్రభావంబుచే
నిల యెల్ల న్వొలయించి వామనయనాహేయాతిసౌభాగ్యలీ
లల కంతంత వినమ్రమ న్మానముపట్లం జాల కౌరా! మహా
కులుఁ డయ్యె న్విధియే యెఱుంగు విషయాంకూరాతిపారుష్యమున్.

గీ. కొల్వుకూటంబు పాలించి తెల్విఁ గన్న
మోముదమ్ములతో గృహసీమ కేగి
రెల్లవారలు మునిచంద్రు నిచ్చి పెచ్చు
బాలముని భాస్కరునకు నమ్రంబువడుచు. ౯౫

మ. దిటవుం జెంది యతండు కల్కి యిడు పాథేయంబు గైకొని య
చ్చటు వాయం దదధీన రాగఝరి సంజ న్మించె నమ్మె నిశా
విటదేహస్థితమోహసంతమస ముర్విం బర్వి కన్మూసె ను
ద్భటతేజం బెడల న్భుజంగగతిసద్భావానుకూలంబుగన్. ౯౬

ఉ. పాఱి వెలుంగుజొంపముల పాదములం బడి సేవ సేయుచున్
మీఱి యొకింత మైత్రి గను మేలము గాంచి క్రమక్రమంబుగా
మాఱుకొనం గడంగి గరిమంబున మించి యడంచెఁ జీఁకటుల్
కా ఱొనగూడువారి నొకకాలము నమ్మినఁ జేటు మూడదే? ౯౭

క. ఇటు కన్నులు మూయుట తెఱ
చుటయు నొకటి గాఁగఁ జేయుచుం దమ మెగువం
బటుగతిఁ జను శిష్యునితో
నిటు లనియెం గురుఁడు నిజవిహీనత దోఁపన్. ౯౮

మ. అటవీభాగము రాలు ముండ్లు గల చాయ ల్పాదము ల్సించెడిన్
గటుఝిల్లీరవము ల్శ్రవఃపుటము లుద్ఘాటించెడిం జోరసం
కటభల్లూకమృగాదనద్విరదఖడ్గప్రాయ మీ లోయ భీ
షటనం బాత్మ నమర్చెడి న్మన ప్రయాణం బింతఁ జాలింతమే? ౯౯

మ. అనినం జిన్నగ నవ్వి ఛాత్రుఁ డను నార్యా! సర్వసత్త్వప్రబం
ధనవిద్యం జలిచీమ కుట్టదు సమస్తక్షోభము ల్మాయు నీ
మనువుం గైకొను మింక నేగవలె నిమ్మార్గాన్ గడుం దవ్వు వో
యెను బో మ్మామడక్రింద నీదు భయ మా యీపల్కు లిం కేటికిన్?

ఉ. ఆరమణీవతంసము ప్రియంబున మీ కని యిచ్చినట్టి బం
గారము సంధ్య వార్చుచు నగాధజలంబులఁ బాఱవై చితిన్
జోరులు గీరులుం దనువు సోకుదురే? యిఁక నేమి భీతి సం
సారము శాశ్వతంబె? కలుషంబు లెడం జొరనీకు మింక నేన్. ౧౦౧

గీ. ఏమి శాశ్వత మని నమ్మి యింతి నెనయ
నీదు శిష్యుని హింసింప నిశ్చయించి?

తదియు నీ చేత నౌనె? నీయాంతరమ్ము
దెలియదా? నాకుఁ జాల్బాలు వెలితిఁబడకు. ౧౦౨

క. అన వెలవెల నగు మొగమున
ననుమానము దోఁప విన్ననై యేమియు మా
అనరామి నూరకుండెం
గనవచ్చునె దారి దైవగతి కెందు? బళీ! ౧౦౩

వ. అను గాథ మదిఁ జమత్కరింప నే మవ్వలిచూపు సూచుటయు. ౧౦౪

గీ. చెన్న కేశవ దేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహీ సమర్పిత మైన యామూవికఁ గృతిఁ
బ్రచిత మైనది యాఅవ ప్రకరణ మిది. ౧౦౫

గీ. తాడెపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిఁటు. ౧౦౬

శ్రీ శివాయ గురవే నమః

# యా మా వి క

## సప్తమ ప్రకరణము

శా. ఆనందం బపరాభిమర్శ మతిమాయం బైన యద్దాని స
త్యానీదృక్సహజప్రకాశమున భ్రాంత్యారూఢతద్భిన్నతా
ధీనోదం బగుదు న్సమస్త మపరార్థీభూత మా నమ్మహా
భానం బందు నెడంద నెప్పుడుఁ బరబ్రహ్మం బవస్థానమున్.

*    *    *

క. శ్రీమన్మత్పురసంస్థిత
భూమానందానుమోదబోధావహ! వి
ద్యామూర్తి! చెన్న కేశవ
నామా! నామాకృతిప్రణాళీమూలా!

వ. అవధరింపు మా వాసుదేవకవి మూకుం జెప్పిన చొప్పున.

మ. మరు నుత్సాహము వెంచి మాధవుని సన్మానించి కేతేనితో
సరసం బాడి ద్విజప్రదిష్టజయవాక్సాహిత్యము న్మెచ్చి సా
లి రసారుత్ప్రసవంబులం గొనుచు నోలిన్ నారులు న్వింట్లుగాఁ
జిరవైరంబున విప్రయుక్తుల మరుత్సేనాని డీకొన్నెడన్.

ఆ. ఒక్క పర్ణశాల నొదిగి కొండొక చేయి
ద్రిండు గాఁగ నేలఁ బండి యున్న
మాను లిర్వురందుఁ డా నిద్ర రామి నొ
క్కరుఁడు దన్ను దూరఁ గడఁగె నిట్లు.

## యోగివియోగ ప్రలాపము

శా. సంతానం బపదిక్కు మై తెరల వాత్సల్యంబు పోఁద్రోచి నా
కాంతారత్నముఁ గోలుపోయి యిటు లీ కాంతారమధ్యంబునం
జింత ల్సుట్టఁగ వాన కెండ కయి వాసిం బాసి జీవింపఁగాఁ
బంతం బొప్ప లిఖించెనేమొ విధి? పాపంబే యిటు ల్సేసెనో? ౫

ఉ. ఆ విధి యేమిసేయును మహామునిముఖ్యుల మంచుఁ గొంద ఱీ
జీవుల కొంప దీయఁ గడుఁ జిక్కఁగ వ్రాసిరి ధర్మముల్ వెతన్
దైవము ద్రోవ వారల ననం బనిలే దది యేమి సేయు నీ
యావదపాయ మేను మరియాదకుఁ బోయికదా వహించితిన్? ౬

చ. అటు లన నేల? హా ననిన నా యధికారులు బాధ వెట్టరో?
జటిలుఁ డితం డొకండు గొనసాఁగఁగ నిచ్చునొ? హంత! యింతకుం
జటులదృశావిహీనుఁడ నిశం గడముట్టెద నెట్లు? యామినీ
విట! నవవిప్రయోగము లభించెన హా నను ని ట్లలంచెదే? ౭

క. నారాచకుపితుఁ డగుచు
న్మారు నొకనిఁ గాల్చి శివుఁడు మాన మెడల మీ
పోరాటమునకు లోఁబడె
శూరుఁడు రిపుశేష ముంచఁ జొప్పడునే? శశీ! ౮

క. గురుఋణము దీర్చుకొంటివి
గరితం దవులుకొని పరులఁ గందించెడుచోఁ
బరితాప మింత కలదే?
పరమాప్తుఁడ వెట్టులైన బావకుఁ జంద్రా! ౯

క. పద్మానుజుండ వనుచుం
బద్మాక్షుఁడు మనుప సిగ్గువడక కులికె దా
పద్మాలయములమేల్మికిఁ
బద్మారీ! యోర్వ వెంత పలుగాకి వినీ! ౧౦

క. అదితిసుతుకరుణ వడసిన
మొదలాకశ్యపముని తపమునఁ గల్గిన మా
య దితిభ్రూణం బవు నీ
మది దయ యన లేదు మంద! మారుతపోతా! ౧౧

గీ. మేను నల్లని దల్ల పద్మినుల నల్లఁ
ద్రావి పిప్పిగఁ జేసెదు తవుల నొకట
నొడలు విడిచిన వెడవిల్తు నూత మూఁది
వేచుచున్నావు జగము పిశాచ మధుప! ౧౨

ఆ. కామునకును నీకుఁ గానఁ గస్సంబంధ
మడచిపడుట గాక యరులచేత
మడిచి యకట చలము మై లాగి విడిపింప
నొల్లఁ గసరె దేది యూహా? కుసుమ! ౧౩

ఆ. కలిమి కల్గునాఁడు గా సిడ రెవ్వారు
స్నైబ సేసెదేని సిరులు గలుగు
నీదుశత్రువులకు నీ కింత పిండంబు
వైవ కేల మిడుకఁ బరభృతంబ! ౧౪

క. మనసిజువాహం బబ్జా
సనురాణికరాభరణము సత్యవతీపా
త్రునిమాత మా కొలమువా
రని జ్ఞాతుల సిరికి మురియ నగునే? చిలుకా! ౧౫

గీ. చాలి యొక్కఁడవే నేల నేలఁ జాలి
తేసి రస మున్న సుభగుఁడ వేని మదను
నుపకరణ మవు నీకు మే నోసరిలినఁ
బగ యడంగదు చుమ్ము పూర్తిగ వసంత! ౧౬

క. అందము చందము శివునకు
బొందియతో నొసఁగితేనిఁ బూర్ణరసము లా

కందమ్ము లాటపాటల
కుం దల సూపంగఁ గలదె? కొఱఁత యనంగా! ౧౭

గీ. ఆడువారలలో నీకు నగ్గలంబు
చనవు దాన జయించెదు జగము లెల్ల
బీరమున కేమి? లోకంబు బీఱువోయె
నొక్కొ నీమాత్ర మగఁడు లేకుండ మదన! ౧౮

గీ. హాయిలో సర్వవిషయంబు లంతరింప
ముక్తి యన నిదె యని భవత్సక్తిఁ బొంగు
నన్ను నినుఁ బాఁచి యిట్లు సన్న్యాసిఁ జేసె
మాలదైవ మిఁ కే మందునే! లతాంగి! ౧౯

శా. సింగారంబున నిగ్గు వెట్టి కురులు న్నీ మించు హేమంబుతో
నంగౌఘం బనురాగపూరమున బింబోష్ఠంబు నిర్మించి త
న్వంగీ! నీ నొసట న్విధాత యిటు వ్రాయం జేతు లెట్లాడె న
న్నుం గామాగమసారధూర్వహమనోంధుం బాపెఁబో యొవ్వమిఁ

క. ఈతూరి జన్మమున కే
నోతరుణీ! ని న్నెనయుదు నుండ దితనిచే
నేతద్భవమున భోగము
నా తప్పులు సైపఁగదవె నలినదలాక్షీ! ౨౧

గీ. అనుచు నొక్కింత మెయి సాచి యావులించు
నితరుఁ గని భీతి మార్పడు నెలుఁగుతోడ
నెంత సేపాయె మేల్కాంచి యిత్థచరిత!
యనిన నాతండు వాని కిట్లనియె నవ్వి. ౨౨

యో గి బా ల యో గు ల సం వా ద ము

ఉ. నా కొక నిద్ర యెక్కడిది? నా గురునాథ! భవన్మనంబు ల
క్ష్మీకమనీయ మార్యకృతిసిద్ధిద మౌ నల విట్ఠలయ్యపె

స్వీకృపయిం బడల్పడి పనింగొను నెప్పటి కప్పుడేకడా
యాఁకలి డప్పి నిద్రయు మదాత్మకుఁ దోఁచు సుఖాసుఖాళితోఁ.

ఆ. ఇంత పిచ్చి కలదె? యెందును దన మేనె
తనకుఁ గాదు శాశ్వతం బనంగ
నితర తనువు కొఱకు నింతలింతలు పడు
వారె? మిమ్ముబోటి ధీరు లకట! ౨౮

ఆ. భూతమయము లెల్ల పురుషుల దేహంబు
లాత్మ వెలుఁగు నొండె యన్ని యెడలఁ
బ్రేమ కలుగవలయు రెండువిధంబుల
సకలజీవులందు సమము గాఁగ. ౨౯

ఆ. సౌఖ్యలవముఁ గోరి సంసార మొనసిన
బహువిధదుఃఖములకుఁ బాలుగారొ?
యిన్ని తనకుఁ గామి యెఱింగి యొంటి మెలంగు
గరిమఁ బోలునొక్కొ పెరసుఖములు. ౩౦

ఆ. ఇట్టితత్త్వ మాత్మ నిరవుకొనఁగఁ జేయ
విష్ణుభక్తి యొండె వెర వెఱుంగు
నదియు వీతరాగ మైన నెమ్మనమందుఁ
గాని యడుగిడంగఁ బూన దెపుడు. ౩౧

సీ. ఏతన్ని రూప మీ యిలయెల్ల నిరసించు
వాస్తవజ్ఞాన మేవనిత యాత్మ
యేకాంత యధరం బనీదృశ సుధఁ గారు
భాయస్తనాఢ్య మేపొలఁతి హృదయ
మేవామ కన్గొన యెల్లవృత్తుల మాన్చుఁ
జందురు దాచు నేశ్యామ యాస్య
మేభామ పాదాబ్జ మింటికి సింగార
మీహితాభావ మేయింతి మధ్య

మా లతాంగి కరము నర్ఘ్యారె పీడించి
కౌఁగిలింప భవము కసటు వాయు
నిట్టి గు ట్టెఱింగి యీరేడుభువనంబు
లేలఁగా నివృత్తి నెనయరాదొ? ౨౮

సీ. కాముఁ డీశప్రీతి కై పాటువడఁగ వ
సంతుఁ డర్చకుఁ బూలు సంతరింప
మలయమారుతము నామరకార్య మొనరింప
నమృతాంశుఁ డుపహార మై రహింపఁ
గోకిలార్భటులు తద్గుణగానములుగఁ గీ
రంబుల నుడులు స్తోత్రములు గాఁగ
మధుపఝుంకృతులు రమ్యనినాదములును గా
రతి భక్తిలో నుపరతినిఁ జెంద
ధర్మపత్ని నివృత్తి గా దైత్యవిమతుఁ
బూజసేసి ఫలంబు ప్రబోధ మెనయఁ
గాంచి యిన్నిఁటి నేలెడుఁ గాక వీని
వశతఁ గుందునె? రెండు నీవంటివాఁడు.

మ. పెరబంధంబుల నూడ్చి దేహమున నంప్రీతిం దిగంద్రోచి య
క్షరరంప ల్లనఁ జిత్తదీపమున నిశ్చాంచల్యతం గూర్చి య
ప్పరముం బూరుషు బుద్ధితో నెమకు మే ల్భాగ్యంబుఁ బ్రాపించి యి
ద్ధర విశ్రాంతి వహింపుమా గురువరా! ధన్యుండ నే నయ్యెదన్. ౩౦

క. అని పలుకు శిష్యునకు న
మ్ముని యిట్లను సర్వశాస్త్రములు నామూలం
బును నెమకిన గార్హస్థ్య
మ్మును బోలఁగ నాశ్రమంబు పుడమిం గలదే? ౩౧

సీ. న్యాయసంభృత మైన హవ్యంబు హవ్యవా
హనునందు వేల్వఁ బుణ్యమ్ము సెందుఁ

గవ్యంబు సంతానకప్రాప్తి మై నవి
చ్ఛిన్న మైనఁ బితౄణచింత దలఁగు
నాతిథ్య మొసఁగి యభ్యాగతశ్రేణిఁ ద
న్పిన సమకూరు స్వర్వీథివాస
మింపైన జవరాలి యెలమి మై నెనయు వి
శ్రాంతి శారీరకశ్రాంతు లెడలు
నిహముఁ బరమును గనఁ గాంచ నెంచెనేని
సంధితమ్మవుఁ దత్త్వ మక్షరము బుద్ధి
నెన్ని తెఱఁగులఁ జూచిన నెనయ రావ
యాశ్రమము లెన్నియేని గార్హస్థ్యమునకు. 3౨

గీ. నట్టడవి నాంధ్రుఁ డేకున్ననాఁడు నేల
నెల్లవా రింద్రియమ్ముల నేలలేరొ?
యన్నియును గల్గి కామంబు లడఁపఁ బూను
వారిఁ బోలఁగలారొ? యెప్పాట వీరు. 33

గీ. విధివివాహిత యిల్లాలు వెతలఁ గుందఁ
గనులు తెఱవని కూనల గతులు సెడఁగ
దండము కమండలము ముత్తి దారవోయు
నాక్కొ? కమంబు లింతకు నోసరిలునొ? 3౪

క. మందమతి గాక జుట్టుం
జందెము మోక్షమున కడ్డె? శాంతిఁ జెఱుచునే?
పందలకుఁ గాక కర్మము
నందలి వైరంబు మేలె? యతి కది లేదే? 3౫

క. అన విని యంకసదుం డను
నసఘా! యిది యేటి వెఱ్ఱి? యందఱుఁ గాంతా
జనముల ధర్మప్రవణతఁ
గొనుచుండిరె? యాశ్రమంబుఁ గొనసాగింపన్. 3౬

ఈహితాకార యగు నిల్లాలి నిరసించి
హీనకాంతల పొత్తు లెనయువారు
వంతకు నొక రిర్వు రైన రాగల మైత్రిఁ
బొడమె సంతతి యని పొంగువారు
నేదియు లేకున్న నింతుల మైదీవ
గను లూడిపడ నెప్డు గాంచువారు
విధి నిషేధము పిన్న పెద్దయు ననరాక
నారీవిధేయు లై నవయువారు
నర్థరతి ధర్మ మడుగంట నదియుఁ గాక
వీతిహోత్రము పాలుగా వీతశంకు
లైన దుర్మదు లా స్వర్గ మాఁకగొందు
రేమొ? యాశ్రమ మేలనో యింతసేఁత? ౩౮

కీ లైన వంటకంబులు
లీలావతు లిండ్లు భోగలీలలు గల వం
చాలోచించియ కా కెవఁ 
డాలిం గొను నాశ్రమంబునందలి దయతోన్? ౩౯

ధామోద్ధామ! రుషం ద్యజించి చెప్పుమా దర్మార్థకామంబులం
దా మీనాక్షి నొసంగె నాతిచరితవ్యంగాఁ బ్రమాణించి యే
నీమన్మానితుఁ డుద్ధరింపఁ గొల మర్థిన్ లోకము ల్గెల్వఁగా
నేమర్యాద మెలంగుచుంటివొ? కటా యే పున్నె మార్జించితో?
శ్రౌతస్మార్తము లైన కర్మముల నాచారంబులన్ దైవత
వ్రాతం బౌ నన సంచరించితె? యఖర్వజ్ఞాన మార్జించితే?
భూతౌఘంబులు తృప్తిసెందెనె? భవద్భ్యాతిప్రదానంబునన్
స్త్రీతాత్పర్యము మాని సంతతికి నై చెల్లించితే కామమున్? ౪౦

ఇన్నిదినంబు లొనర్పని
జన్నంబు లిఁకేమి సేయఁ జాలెదొ? పోనీ

యన్నియు మును చెల్లిన నీకుఁ
బన్నుగ వైరాగ్య మూనఁబడుఁగాక మునీ! ౪౧

క. సత్యము వలుకుదె? సంధ్యా
కృత్యంబు లొనర్చెదే? హరిం దలఁతె? కటా
నిత్యాగ్ని వ్రేల్చెదవె? సా
హిత్యమున గృహంబు కాల్పనే? యివి సెడినన్. ౪౨

క. అనుచుండఁ గాదు కాదని
మనమున సంభ్రమము దొనుక మానికులగ్రా
మణి యిట్లను శిష్యునితోఁ
ననుమానము దలఁగుమయ్య! యీ విషయమునన్. ౪౩

గీ. పూర్వకాలంబునం దెష్టా పున్నె మేమొ
చేసియున్నాఁడ నట దానఁ జేసి నాకుఁ
బాండురంగాధినాథుఁ డప్పడఁతిఁ గూర్చెఁ
గానినాఁ డంత విమతినే? నేను సత్స! ౪౪

క. ఇంతకు నా కమలాక్షి ని
శాంతమ్మున విట్ఠలయ్య సాక్షి యనిన నా
పొంత నమరి పలికిన య
క్కాంతసఖికి సాక్షు లిచటఁ గలరె? గురువరా! ౪౫

క. అను తన్నుఁ గసరికొట్టుచు
ముని కోపము విస్మయమ్ము మునుకొనఁగా న
వ్వాన భావ మెఱిఁగి ఛాత్రుం
డినసన్నిభ! దివ్యదృష్టి నిదె కను మనినన్. ౪౬

యో గి ని ర్వే ద ము

శా. ఆ కాంతామణి కైతవాచరణ మాద్యంతం బవేక్షించి సు
శ్రీకుం డాతఁడు మేను మా నయిన వాసిం బాయు నాస్యంబుతోఁ

జేకొ లాడక యుండియుండి యనఁ జొచ్చెన్ వైమనస్యంబుతోఁ
జేకూరు న్గుణహానికై చెలువము లిస్సీ సౌమనస్యంబుతోన్. ౪౭

సీ. వలచిరా? వలపింతు రలరువిల్తుని వింటి
కంది కందని స్థాణునైన బలిమిఁ
గొలిచిరా? కొలిపింతు రిలఁ దార సంగతి
నర్థి నర్థము కాని యల్పునైనఁ
దలచిరా? తలపింతు రెలమి రంభాప్తికిఁ
జిక్కి చిక్కని శ్రీదశిశువు నైనఁ
గులికిరా? కులికింతు రల చిల్కయలమేల్మి
కుల్కి కుల్కని వ్యాసయోగినైన
నకట వికటాత్ము లైన యొయ్యారు లనిన
నవనిఁ బురుషులపాలి దయ్యాలు గారె?
డంబ మనృతంబు టక్కు లాడంబరములు
కళలు వీరి యుపాదానకారణములు. ౪౮

క. చూపుల కోపుల నోగిఁ దటి
తీపుల మాటల నొడళులఁ దెరవలు మరు పెం
దూపులకుఁ బడక తక్కిన
నేపటి సాధింత్రు పురుషహృదయవిషయముల్. ౪౯

ఆ. ఆత్మహితముపొంటె ననువుమై మగవారిఁ
గొలుతు రంతరాత్మఁ గలఁతు రంతె
కాగడాలు వైచి గాలించినను సుంత
స్త్రీలయందు ధర్మశీల మున్నె? ౫౦

మ. అని శాపోన్ముఖుఁ డైనఁ గాంచి గురువర్యా! కొంద ఱీ రీతివా
రని యజ్ఞానిని దూఱ దార మవుఁ బుణ్యాంబార్యవాక్చాతురీ
పునరుక్తీకరణప్రవీణచరిత ల్యూభాభాష లా భావిను
ల్గనరారో? వినరారొ? యిమ్ముల సుశీలాముఖ్య లాఖ్యాయికన్. ౫౧

ఆ. మనసు కుదిరియున్న మన కొండ్ల గోడ వేల?
తలఁచినంత దుష్కృతంబు లెడపు
పుణ్యసతుల చరితములు విమర్శింపుమా
వ్యక్తిదోసఁగు జాతి కదుకకుండ. ౯౨

ఆ. కలఁడు పుడమినే ల్లోకండు ఘూర్జరవిష
యమున నియమహీనుఁ డర్థపరతఁ
గడుపు గట్టెఁ గణిగి కర్మంబు లేక ద
రిద్ర మేమి కలదొ? రేఁ పౌనర్ప. ౯౩

గీ. ఆరు విడనాడె నేవిధి నబ్బు నాలు?
గేడిఁటికిఁ బొలువడెఁ జిక్కె నేనిఁటివల
నైదు మూ డొకఁ డైన బ్రాహ్మణుఁడు వాఁడు
మూటికిని ముడివై చె నిఁ కేటి భయము? ౯౪

ఆ. అట్టి పురుషు తోడ నటు నిటుఁ బడకుండఁ
దా నడిచె సతీవ్రతంబు దారిఁ
బాండురంగవిభుని పరమకారుణ్యంబ
యిహము పరముఁ గూర్ప నిల సుశీల. ౯౫

ఆ. ఇట్టివార లెందఱెందఱు లేరు? పు
రాణధోరణులఁ జిరంటు లిపుడు
రేఁపుగూడ నుండరే? నుండనేర్చునే?
పుడమి పెణక విఱిగి పడక గురుఁడ! ౯౬

వ. అనుచున్న చిన్నముని మాటల కడ్డము వచ్చి పశ్చాత్తప్తుఁ డైన
గురుండు దీనుండై. ౯౭

మ. అమలాత్మా! భవదీయమార్గ ముచితం బై తోఁచె నట్లుండ ని
మ్ము మహాసంస్కృతిసాగరంబునఁ గడు న్మోహంబునం జిక్కి స
ర్వము భోగ్యార్థము శాశ్వతం బని యనర్ఘం బైన బోధంబు హీ
నమతిం బోవఁగఁ ద్రోచి వ్రతవమ న న్మన్నింతురే? వేలుపుల్. ౯౮

క. అలవున సంపాదించితి
జలగడిగితిఁ బున్నె మెల్ల శాంతిపర! నను
న్వేలయించు ధర్మ మేదీ?
యలసితి నింకేది యొనర్తు? నార్తుఁడ నైతిన్. ౫౯

శా. సంసారాంబుధిఁ దేలుచు న్మునుఁగుచున్ జన్మంబు లెన్నేఁ జనన్
గంసారాతిని గొల్చు భాగ్య మిచటం గల్గెన్ గృతార్థుండ నై
ధ్వంసం బెన్నఁడు లేని మేలిపదముం బ్రాపింపఁగా బ్రహ్మమీ
మాంసం బుచ్చెదఁ గాల మిచ్చ నను-చో మాటెన్ బధ మ్మిమ్మెయిన్.

సీ. కన్నాతఁ డీ నొక్క కన్నెఁ గైకొనలేదు
చానల జోలియే మానలేదు
మఖముల సురల సంభావించుపని లేదు
కెరలి దైవమ్ముల గెలువలేదు
పూర్వసుకృతములఁ బొనరింపఁగా లేదు
ప్రణవోక్త్యనుష్ఠానపరత లేదు
పూనిక నిత్యాగ్ని నైన ధరింపలే
దాత్మాగ్ని ధారణాయతియు లేదు
కాదు గార్హస్థ్యము యతిత్వకలన గాదు
విధికిఁ బాసి చరించితి విచ్చలవిడి
స్వర్గతియు లేదు లేదు మోక్షప్రసక్తి
నాకు రెంటికిఁ జెడిన సన్యాసి నైతి. ౬౧

క. ఏ గొడవలు నాకేలా?
యాగోదూరా! వచింపవయ్యా! దురిత మే
యోగమునఁ దొలఁగు నింకే
యోగమ్మున మోక్షపదమహోన్నతి గలుగున్? ౬౨

క. దరి లేని సంసృతిం బడి
తిరుగుడువడుచున్న నన్నుఁ దీరము సేర్పన్

బరమాప్తుఁడ వై వచ్చిన
గురుమూర్తివి కాక భవ్యగుణ! శిష్యుఁడవే? ౬౩

చ. అను గురువర్యుతోడ నను నాతఁడు దేవ! శమింపుమయ్య పో
యిన పని కింత చింత తగునే? హృదయంబు దృఢం బొనర్చి నే
ర్పున నీక నైనఁ బూను మనురూపవిధానము ముంజలో నిషీ
కను వలె నుద్ధరింపుము స్వకాయనికాయమునందు నాత్మనిన్. ౬౪

ఆ. ఔపనిషదము మత మద్వైత మా దారి
మిథ్య ద్రష్టృదృశ్యమితము జగము
దృక్కె తా నిది గురుతింప జీవన్ముక్తుఁ
డతఁడు మూఁడు తఱులయందుఁ గూడ. ౬౫

ఆ. అనుచు మొదలువెట్ట నద్దానికిని నాకు
హాస్యమశక మొనరు నంతరమ్ము
విత్త మానె? యిట్టి విక్షిప్తమతి కది
యనెడు గురున కనియె ననుగు మరల. ౬౬

క. విక్షిప్తమైన నెమ్మన
మాక్షిప్తము గాఁగ యోగ మభ్యాసం బా
పక్షమునఁ జేయుమా త
చ్ఛిక్షావిధి మున్ను నీవు సెప్పవె నాకున్? ౬౭

యో గ గీ తా వ ళి

గీ. సంసరణహాలహలమోహాశమనమునకు
జాంగలికభావ మూని విశ్వమ్ము నోము
దర్శితాత్మసుఖావబోధముల గురుల
చరణసరసీజములను శీర్షమునఁ దాల్తు. ౬౮

గీ. శివుఁడు సెప్పిన లక్షపై చిలుకు గల ల
యావధానంబులందు మాన్యతమ మైద్ది

మహితనాదానుసంధిసమాధిపరుల
కట్టి లయ మాదరింతు మహర్నిశంబు. ౧౯

గీ. రేచకము పూరకము నాదరించు కుంభ
కముల నాడులు సువిశోధితములు గాఁగఁ
బొడమువెంచు ననాహతాంబుజమునుండి
బోధ మాత్మావగమ్యం బపుడె స్వయముగ. ౨౦

గీ. ఆనతి యిదె నాదానుసంధాన! నీకుఁ
దత్త్వముల గెల్వ నీవె సాధనము వెలుఁగు
దనిలగతితో భవత్ప్రసాదాప్తిఁ గాదె
విష్ణుపదమున నా మది విలయ మెనయు. ౨౧

గీ. మునులు జాలంధరోడ్యాణమూలబంధ
ములు గళోదరగుదనేయము లని యందు
రీ త్రిబంధంబు లలవడునేని ఘోర
కాలపాశప్రబంధ మెక్కడి దతనికి? ౨౨

గీ. ప్రస్తుతోడ్యాణజాలంధరముల మూల
బంధమునఁ గుండలిని నిద్ర వదలి నిగుడఁ
బ్రత్యగభిముఖత సుషుమ్నరంధ్ర మెనయు
వాయువు గమాగమంబులం బాచి వెలుఁగు. ౨౩

గీ. మాటిమాటి కపానంబు సూటి గాలి
మలఁపఁ జెలరేఁగు నాధారతలహుతాశు
జ్వాలలఁ గరంగు చంద్రబింబంబువలన
నొలయు పీయూషధార దమ్ముఁ జిమ్ము గ్రోలు. ౨౪

గీ. మూడు బంధంబు లభ్యాసమునఁ బనుపడ
నొదవి రేచకపూరకవ్యూదసనమున
విషయవాహిని శోధించు విధికి నగుచు
వెలయు కేవలకుంభక విద్యఁ గొలుతు. ౨౫

గీ. అబ్బైసనమున శూరు లనాహతమునఁ
జేతమున సావధాను లై చిత్తగింప
వెలయు కేవలకుంభకవిభవ మడఁచు
శ్వాసమానసముల సంప్రసారములను. ౨౬

గీ. హఠములం గుంభకము లుండె నతిశయముగఁ
గుంభకం బనఁ గేవలకుంభకంబె
ప్రాణవిప్లవ మద్దాని వైకృతములు
ప్రాకృతము లైన రేచపూరముల లేమి. ౨౭

గీ. అంతరంగంబు నిశ్చల మై త్రికూట
కోటి నభమునఁ గేవలకుంభకమున
స్తంభితం బైన సూర్యశశధరనాడు
లను వదలి ప్రాణగతు లడ్డె లయము నెనయు. ౨౮

గీ. ప్రాణ మున్న యునికిన ప్రత్యాహృత మయి
మేల్కొనిన కుండలిని ప్రమింగ మిగిలిన యది
పశ్చిమపు మార్గమున విష్ణుపదముసూటి
నంది మందమందముగ లయంబు నెందు. ౨౯

గీ. అడ్డు లేకుండఁ బొలు శ్వాసానిలముల
గతులఁ గేవలకుంభకస్థితుల నడఁచు
సుమతి కఖిలైంద్రియకవృత్తిశూన్య మైన
వాయులయ ముదయించు నమేయ మదియు. ౩౦

గీ. దేశకాలవిచారంబు దృష్టిలక్ష్య
మానిబరోధంబు బిత్తి బంధానుగమము
ధారణాధ్యానయోగసంధానకలిత
కష్టములు లేవు రాజయోగము మరిగిన. ౩౧

గీ. దృశ్యములఁ జూచి చూడని దృష్టిఁ దవిలి
యున్న మెయి నుండు నధిరాజయోగుల దశ

కాదు మేలఁకువ నిద్దుర కాదు కాదు
జీవితము కాదు మృతియు విచిత్ర మెదియొ? ౧౨

గీ. అస్మితామమతాదుల నార వదలి
రాజయోగంబు చక్కఁ దిరంబునడిన
చేతము గలట్టివారికిఁ జెలయు నొక్క
దృక్కు దృశ్యత లేదు ద్రష్టృతయు లేదు. ౧౩

గీ. కనులు మూయుట తెఱచుట గలుగ దెందు
గాలియును రేచపూరసంగతికిఁ గాదు
మదికి సంకల్పము వికల్ప మొదవ దెచట
నల మనోన్మని నా కవు ననవరతము. ౧౪

గీ. చిరము చిత్తేంద్రియకవృత్తినిరసనమున
శ్వాసము ప్రవాహ మెల్ల నిశ్శమిత మైన
గాలి లేనియెడను దీపకలిక వోలు
నల మనోన్మని నా కవు ననవరతము. ౧౫

గీ. ఉన్మనీస్థితి యెమ్మెయి నొనరు ననెదొ?
చెప్పెద నుపాయ మొకఁ డుదాసీనభావ
మమర లోకంబు గాంచుచు నవహితమతి
మెలవనీకుము సంకల్పముల విదితుఁడ! ౧౬

గీ. మెలచు సంకల్పముల బార్ల బలిమి నపుడె
యవహితుఁడ వయి గిల్లివేయం గలిగిన
నల్లుకొన నైన విషయ మొం డందకునికి
మెల్ల మెల్లగ మనము శమించుఁ జుమ్ము. ౧౭

గీ. ఊరుపు లడంగ మెగలని యొడళ్ళుల నెరి
నర్థసంమీలితముల నేత్రాంబుజముల
నయమునం దోఁచు సహజామనస్కముద్ర
నేర్చికొందము గాంచి మానికులమందు. ౧౮

గీ. సహజ మవు నమనస్కత సంయమము లిదె
నాది నే నను రాగంబు పా దెడలుడు
మానసగతం బనిలవృత్తిహీనము గగ
నావశేషము భావము నందుచుండ్రు. ౮౯

గీ. అన్ని యింద్రియసరణుల నటు మరల్చి
పరమ మవు స్వాత్మరూపంబు వరలఁజేయు
జ్ఞానమయ మైన సహజామనస్కముద్రఁ
బడయ నౌదునొ యెపు? డన్యభావ మురివి. ౯౦

గీ. ప్రత్యగాత్మవిమర్శసాంతత్యమునను
బురుషు మొదలింటి వాసన ల్వ్రాలిపోవఁ
బరిహరించుచు లోకసంభారచింతఁ
దో నొక యజాడ్య నిద్ర ప్రాదుర్భవించు. ౯౧

గీ. చాలి సవికల్పసంకల్పమాలఁ ద్రెంచి
కర్మజాలంబు మొదలంటఁ గత్తిరించి
పేరుఁ డౌ యోగి యెడ విజృంభించు యోగ
నిద్ర సంతతాభ్యాసాతిభద్ర యపుడె. ౯౨

గీ. విశ్వతైజసప్రాజ్ఞాఖ్యవివిధదశల
కవ్వలఁ దురీయతల్పంబునందు విశ్ర
మించి యొక నిర్వికల్పసంవిన్మయి యవు
నిద్ర నెనసి సుఖింపు మనిశము సఖుఁడ! ౯౩

గీ. మించి పరమాత్మరవి ప్రకాశించుచుండ
[illegible] మటుమాయ మైన
జగము జగముగ నుండ విచక్షణు లటె
కను లమలములు విచ్చి యొక్కటి గనరటె. ౯౪

గీ. అట్టి యమనస్కసిద్ధి సమాధి నెపుడు
చెందువాఁడనొ? శ్రీశైలశృంగగుహల

దీవ తెపు డల్లుకొనునొ? మైదీవ నింక
గూ ళ్లెపుడు ఖగము లమర్చుకొనునొ? చెవుల. ౯౫

గీ. నిర్వికల్పసమాధి నే న్మృగనయనల
కుచయుగలమందు నే న్మది గొఱలుఁగాక
కాపథమొ? సత్పథమొ? చెందుఁగాక నాకు
విభున కంటదు మతిగుణావిగుణగణము. ౯౬

గీ. శంకరగురుండు సంస్కృతసరణిఁ దెలిపె
ననునుసరించెను దాని నారాయణుండు
తేటతెల్లముగా నిట్టి తెరువు వట్టి
రండు సంసరణాబ్ధిపారం బెసయఁగ. ౯౭

వ. అని యేమేమొ వివరింపఁ బోవు శిష్యు నాఁగి గురుం డిద్దానికి నిప్పు
డే ననర్హుండన. ఈ మేనికి నా సాధనకు నెంతదూరము? భారవిరహిత
మ్మవు దారి న న్నాదరింపవలె ననుటయు నతం డటులైన_ ౯౮

గీ. భవుని యొడలునఁ బొడమిన భవ్యజలము
కాయసంశుద్ధి గూర్చ సంకల్ప ముడిగి
బుద్ధిధారాసదాధారభూతుఁ జేసి
పాండురంగేశుఁ బతితపావను భజింపు. ౯౯

చ. ఎఱుఁగవె? పుండరీకముని కింపవు తేజము ము న్నెఱింగియుఁ
మఱచినఁ జిత్తగింపు జనమాన్యతపోవిభవా! భవాదృశుల్
తఱిఁగొన గ్రంథి విప్పఁడె? పతత్పశుకీటమృగాదిజాతులఁ
గఱకటి మాన్చి ప్రోవఁగ దుకాణము వెట్టినవాఁడు వేడుకఁ. ౧౦౦

మ. అనుమానింపఁడు నారి యైనఁ బురుషుం డైన న్సమర్థించున
ద్దనుకూలించునె కాని పాప మని పుణ్యం బంచుఁ ద న్నాశ్రయిం
చినచోటం గమనింపఁ డా విభుఁడు నిస్సీమప్రమోదాత్మకుం
డనఘా! వీడి చనంగ లేఁ డతఁడు చిత్తాబ్జాసన మ్మిచ్చినన్. ౧౦౧

గీ. కాయజుని నామతించి "కృష్ణాయ" యనుచు
మ్రొక్కుచుండు మహాత్మిశ మ్మొక్క ఘక్కి

నార్తికిని భక్తి భక్తికి నార్తిఁ దోఁడు
సేసి యానిద్ర మానిద్ర మాస లుడిపి. ౧౦౨

గీ. కాష్ఠమునఁ గాష్ఠ మిడి రాయఁ గలుగు నగ్ని
త్రవ్వఁగాఁ ద్రవ్వఁగాఁ దోఁచు ధరణి జలము
సాధ్య మనరాని దుండ దుత్సాహమునకు
మొదలుపెట్టిన పనులు సంప్రాప్తిఁ గనవె? ౧౦౩

గీ. కానఁ బోదము పదుఁడు నిష్కాసితాఘు
నల్ల దేవునిఁ బౌండరీకాశ్రమమునఁ
జంద్రభాగాస్రవంతి నిశ్చ్రప్రచముగఁ
గడఁగుఁ గడుగంగఁ బాపపంకముల నెల్ల. ౧౦౪

క. క్షేత్రము తీర్థము మూర్తియు
నాత్ర ముడుప నచటు చేరి యద్వైత విధుల్
స్తోత్రము లొనర్చి కొలిచెద
మా త్రయికిని జిక్కనట్టి యానీలాంగుల్. ౧౦౫

గ. అనెడు శిష్యుని మాటల కౌ నటంచు
సమ్మతించి గురుండు నేస్తమున వెడల
నిరువురుం బోయి రప్పు డప్పరమపురుషు
క్షేత్రసీమకు నియతి విశిష్టమతులు. ౧౦౬

వ. అను నవ్విబుధుం గొనియాడి మే మవ్వలికథ ననుయోగించుటయు—

గీ. చెన్నకేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహిం సమర్పిత మైన యామావికఁ గృతిఁ
బ్రచిత మైనది యే డవ ప్రకరణ మిది. ౧౦౭

గీ. తాడెపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
నన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిఁబు. ౧౦౮

శ్రీ శివాయ గురవే నమః

# యా మా వి క

## అష్టమ ప్రకరణము

శా. నా యజ్ఞానము వోయె నెక్కడనొ? ధన్యత్వంబు సేకూరె వి
ద్యాయోగం బమరె న్సమస్తజగదంతర్యామి యై శాశ్వతం
బై యేకం బవు తత్త్వమేన యవురా యానంద మి ట్లుండవ
ద్దే యంచుం బులకించు ముక్తి మహితాప్తిం గొల్తు న్ప్రశాంతముః.

* * *

క. శ్రీ వినయ విజయ ముఖస
ద్భావాశ్రయభక్తజనసదాయోగక్షే
మావహనముద్యమాపాం
గా! వరదా! చెన్నకేశవా! మాదేవా! ౧

వ. ఆ వాసుదేవావేదితకథానిర్వహణపరిపాటి, ౨

గీ. ఆలకింపు మనంతరార్థానుగమముఁ
గువలయంబులు విలసిల్లెఁ గుసుమశరుఁడు
స్థైర్య మొనసెఁ దపస్వి యమా శశికి మిపులఁ
బ్రాభవం బబ్బె గురుఁడు లాభమున మెఱయ. ౩

ఒకకాంత

ఉ. ఆసమయంబునం గలితయామునకందలకాంతి యాతపుం
బోసరిలం బ్రకాశమయ మూర్జిత మావనిలోని సౌధవి
న్యాసము దివ్యతం దెలుప సందలిసుందరచంద్రశాలికా
భ్యాసమునం బ్రభాసిలె నిభాస్వరమూర్తి యొకర్తు శ్రీ యనఁ. ౪

క. అని పొగులు దాని యనుచరి
కనుదమ్ములఁ జెమ్మ గ్రమ్మఁగా సత్వరయై
యనునయభాషణములఁ జే
ర్చునెడ న్వినఁబడియె నొక్కచోఁ బల్కులిటుల్. ౧౮

మ తీ యొ క స తి

శా. ప్రాణాయామ మొనర్చి తిట్లు పవను న్బంధించి సర్వేంద్రియ
శ్రేణీనిశ్చలతాప్తినిర్విషయనిర్విష్టైకసంవిత్తు ని
ర్వాణాత్మం గదియించి కారణము భద్రం బమ్యోయం గాక మ
త్ప్రాణేశా! యెఱిఁగింపవే? యదియుఁ దెల్పన్వచ్చునే నీనికిన్. ౧౯

గీ. పరమధర్మప్రవర్తకవైదికాధ్వ
నీనులకు విశ్రమం బిడు నెలవ వీవు
దేవ! యుపరమ మూని యీ తీరు నెనయఁ
బరమమునులకు బుధులకు శరణ మేది? ౨౦

శా. భక్త్యాయత్తతఁ గాము భూమిక వరింపన్ నా తదర్థంబు వే
దోక్తశ్రీజాతుఁడ వయ్యు స్యందనముతో నొప్పారి న న్బట్టి త
చ్ఛక్త్యాభీలనృపవ్రజంబు శరవిస్తారంబునం దోఁచి ని
ర్వ్యక్త్యానందము గూర్చినట్టి విభుఁ గల్యాణాత్ము నిన్గొల్చెదన్.

క. ఇది యొకఁ డేలొ? మహిమా
స్పద! లోకార్థంబ కాక భవనీయవిచి
త్రదశావిర్భావము లె
య్యది కర్మ మవశ్యభోగ్యమై కావలసెన్. ౨౨

క. మునిమృగ్యమాణ! నీ యి
చ్చిన చనవున ని ట్లడిగెదఁ జిత్తమ్మునఁ జూ
చిన నీదు ధ్యానధారకుఁ
బనుపడదు నిమిత్త మేమి భంగి మహాత్మా! ౨౩

సీ. పడఁతి యెవ్వ తెయేని ప్రార్థించె నే నొక్క-
మాటతో నాపద మలుపరాదె?
ప్రబలుండు దుష్టుఁ డై బాధింపఁ జొచ్చిన
ననుపరాదె సుదర్శనాయుధమ్ము?
సాక్షాత్కరించి ప్రసాదింపఁగా రాదె?
భావితాత్ముం డయి భక్తుఁ డున్న
సెలవీయరాదె? మార్పులు గొన్ని జగమున
కవసరం బైన నింద్రాదిసురల
కింద్రియంబుల నెలయింప నెంచెదేని
నర్థముల కేమి కొదువ దెమ్మనఁగ రాదె
సమయకల్పిత మయి తీర్పఁ జనని యెడరు
లోక మింత కెనయదు గా లోకనాథ? ౭౪

క. అను పల్కులకు ననంతర
మున విన వీతెంచె దూరమునను౦డి మహా
స్వనమున నత్యాదరమునఁ
బనివడి పరవశత దోఁపఁ బలుకఁబడు నుడుల్. ౭౫

ధ్యాన శ్రుతి

మ. విలసద్దీధితిమండలాత్మకము దుర్విజ్ఞేయ మై యెందుఁ బూ
సలలో దారమువోలె నిండి సకలాశ్చర్యైకసంవాస మై
సులభం బయ్యు నతీంద్రియం బయిన తేజోరాశి తా నై ప్రకా
సిలెడుం గావుత విభ్రమం బెడల సచ్చిత్తానుభూత్యర్థ మై. ౭౬

క. యోగులకు సాంఖ్యులకు సం
త్యాగపరాత్ములకు నవ్యయానందపద
శ్రీగోచరతారూఢం
బై గమ్యం బైన నెలవు నభ్యర్థింతున్. ౭౭

క. వికృతులు పదారు సప్త
ప్రకృతులు నెద్దానివలన భాసిల్లెడు ని
ర్వికృతి యవు ప్రకృతి కవ్వలి
సుకృతి కభిన్నుఁ డవు పరముఁ జొచ్చి సుఖింతున్. ౨౮

క. మూడు గొనంబుల కెఱుఁగం
గూడని మార్గమున నెలవుకొని కేవలతా
క్రీడాపరులకుఁ బశ్చిమ
నాడీగోచరతఁ దోఁచు నరు ధ్యానింతున్. ౨౯

గీ. తత్త్వములకుఁ దజ్ఞులకు శాస్త్రముల కేని
నందరాకున్న రూపంబ యయ్యు స్వాత్మ
భావనాసంతతాభ్యాసభక్తిపరుల
కొంగు బంగార మవు దేవుఁ గొలుచువాఁడ. 30

గీ. హోత హవ్యంబు హవనీయ మొక్కఁ డనుచు
మంత్రపరు లయి శాబ్దప్రమాణబుద్ధి
యజన ముభయవిధంబుల నాచరించు
పుణ్యమూర్తుల తత్ఫలమూర్తి నెంతు. 31

గీ. సగుణమూర్తిప్రభావముల్ క్ష్మాజలాది
భూతభౌతికమహిమానుభూతు లరయ
రాని వనఁ గేవలాత్మ సమాను నిన్నుఁ
దెలిసికొనవచ్చు నెట్లు లజ్ఞులకు? సభవ! 32

శా. లేవా? లోకములందుఁ బూరుషవరా! లే లెమ్ము నిద్రించుచు
న్నావా? దేవ! భవాబ్ధి భీతి గొలిపె న్నక్యం బశక్యం బటం
చీ వాలోచన సేయరా దిపుడ రావే యాపద ల్బాపవే
ప్రావీణ్యం బది యింక నెన్నఁటికి దుర్గాసోదరాసాదరా! 33

సీ. అంబుధిఁ జొచ్చి మాయావిఁ జంపుట కాదు
కొండ వీపునఁ దాల్చు కొలువు వలదు

కొమ్మనఁ బుడమి సర్వ మ్మెత్తు పని కాదు
జాతులు మార్చు వేసమ్ము వలదు
కొట్రమై లోకము గ్గొలుచు నక్కఱ కాదు
నెత్తుటఁ జెరువులు నింపవలదు
సంద్రంబు గట్టి ద్వీపము మార్కొనుట కాదు
బుజమున నాగలిఁ బూనవలదు
ప్రాతచట్ట మ్మొకటికి మార్పంగవలదు
కత్తి గైకొని గుఱ్ఱ మెక్కంగ వలదు
చాలు కడగంటఁ బొలుచు దయాలవంబు
సిద్ధసాధన! నన్ను సముద్ధరింప. ౩౪

మ. తన యిల్లాలొడ లర్ధ మ్మాఁకగొన శుద్ధబ్రహ్మచర్యంబుతో
ననపాయుం డయి సర్వసామ్యముగ విద్యం గూర్చి యాపన్నులం
గొని మోక్షం బవిముక్తమం దొసఁగు త్ర్యక్షుం జూడ మోమోడి చు
మ్మ నిను న్వేడెద గోపికాదయిత! మా మోహంబు సైరింపఁగన్.

మ. హరుఁ డన్నన్ హరి యన్న నొక్కఁడగు విద్య ల్సెప్ప నుద్యోగమం
దరయ న్భేదము దోఁచెనేనియు మహార్హం బౌ మహంబే యహం
పర మంచుం గొనియాడెద న్సతత మద్వైతానుభూతి న్విభా
స్వర మౌ నీ మహనీయమూర్తి కమలాక్షా! మోక్షసంధుక్షణా! ౩౫

శా. గోగోపీజనపాలకా! వినుము న న్గోపింపకుండ న్మహా
భాగా! యొక్కటి విన్నవింతుఁ దగ నాబాల్యంబు లెక్కింపఁగా
నాగఃపుంజము లెన్నియే న్గలవు నాయందైన నీయంత గా
నేగానయ్య! క్షమింపుమీ యనుచితం బే యున్న నా ధోరణిన్. ౩౬

క. ఎటులైన మాకు దొర వీ
వటె యే మాడిన మతేమి యర్థం బగునో?
ఘటమానజగన్నాటక
నటవర! మత్పాత్రపోషణ మొనర్పఁగదే. ౩౭

మ. దరహాసమ్మున లోచనాబ్జములు రాధాలోలతం దెల్ప ని
ల్చి రమావాస మురమ్మున హారముల తెల్విం బెంప మధ్యమ్మునం
గరము ల్సేరిచి శంఖచక్రములతోం గాలాంబుదశ్యామసుం
దరమూర్తిం గయిసేసి యున్న విభు భక్తత్రాత ధ్యానించెదన్. ౩౯

శా. సారామోదనిరంతరం బవు సహస్రారాబ్జపీఠమ్మునన్
శ్రీరమ్యం బవు కర్ణికాగ్రమున నారీవారము ల్గొల్వ నిం
పార న్నిల్వఁగ దేవదేవ! నిను నాహ్వానించితి న్భావితేం
ద్రారామప్రసవార్చనం గొనఁగదే యాత్మాభిముఖ్యంబునన్. ౪౦

గీ. విగతవిషయమల మ్మయి వెలయు హృదయ
హైమపాత్రమ్మునం జేర్ప ననుమతింపు
గంగఁ గన్నట్టి నీ పాదకమలయుగళ
మర్థిఁ గడిగెద మత్పాప మవగతముగ. ౪౧

క. అంబుజచారువిలోచన!
పంబినభక్తి న్సుగంధబంధురనవపు
ష్పంబులతో నిం బగు న
ర్ఘ్యం బొసఁగెదఁ గై కొనంగ నర్హం బిదియున్. ౪౨

గీ. అమృత మసులభ మైనఁ బంచామృతముల
స్నాతు నొనరింత్రు నిన్ను నాచార మనుచు
నవియు గూర్చెద నిందుబింబాంతరరస
మాహరించెద భావన నదియుఁ గొనుము. ౪౩

శా. శీతంబు ల్విమలంబులుం బరిమిళచ్ఛ్రీగంధము ల్పంచగం
గాతీర్థంబులు కోష్ణము ల్వలసినం గల్పించితి న్సుప్రభా
స్ఫీతాష్టాపదకుప్యరత్నములఁ గావింపంగదే దేవతా
నేతా! స్నాన మనుక్రమమ్ముగ ననున్ దృష్టాంతరుం జేయఁగన్. ౪౪

క. బంగారుజరీ నెఱసి సొ
బం గగు కౌశేయపీతవసనంబులు రెం

డుం గొని తెచ్చితి నిచ్చితి
సింగారింపుము మహేంద్రసేవాలోలా! ౪౫

క. భక్తి న్సువర్ణసూత్రా
భ్యక్తంబులు గా నొనర్చి యర్పించెద నో
శక్తిత్రయావభాసక!
ముక్తాయజ్ఞోపవీతములు దాల్పఁగదే. ౪౬

ఉ. సారసుగంధిచందనరసంబు సమంచితశీతపీతక
ర్పూరపరాగసంస్కృత మపూర్వవిలేపన మిష్టగంధవి
స్తారిత మంగకంబుల బుధస్తవనోచిత! పూయువాఁడఁ గ
స్తూరిక రంగరించి యిడుదుం దిలకంబు బరిగ్రహింపుమీ. ౪౭

గీ. మణికిరీటమ్ము కౌస్తుభమణి సువర్ణ
మయము మొలత్రాఁడు వనమాల మహితకుండ
లమ్ములు మహాంగదమ్ములు సొమ్ము లనుచు
నీ కొసంగెదఁ దాల్పవే నిగమభూష! ౪౮

గీ. పద్మరాగంపుఁ బలుకులఁ బోటిసేయు
కుంకుమాక్తాక్షతంబుల గొనముగాను
మాచరణ మాకచంబు నంగాంగపూజ
లారచించెద వేదవేదాంగవినుత! ౪౯

శా. శ్రీకృష్ణాయ నమో రమాధిపతయే శ్శృంగారదైవాయ రా
ధాకాంతాయ చ పుండరీకవరసంధాత్రే విధాత్రే నమోఽ
స్తోకా యాత్మభువే యటంచు సుమనస్తోమంబు లార్యా! మనీ
షాకల్పద్రుమవల్లరీకలితము ల్సాధించి పూజించెదన్. ౫౦

క. తమ్ములు మల్లెలు తులసిద
ళమ్ములు కుందములు పాటలమ్ములు కరవీ
రమ్ములు గేదగులు లవం
గమ్ములు మొదలైన పూలగము లర్పింతున్. ౫౧

క. ధూపం బాగరవం బిదె
దీపమ్ము త్రివర్తిసముపదీపిత మిదె దే
వా! పాండురంగమూర్తీ!
యీ పజ్జ న్నాతమంబు లెడలింపఁగదే. ౯౨

మ. అనుకూలంబులు సూపశాకచయముల్ హైయంగవీనాజ్యచిత్రా
దనము ల్మోదకభేదము ల్బహులము ల్దధ్యాదిచిత్రాన్నచో
ష్యనికామప్రియలేహ్యపాయసము ల్చ్ఛాయంబులుం దేవియల్
దనివారన్ దయ నారగింపుము నివేద్యంబు ల్నివేదించెదన్. ౯౩

గీ. ఎడనెడం గొను పానీయ మిందిరేశ!
పాణిపాదంబు గడిగెద భవ్యచరిత!
విమలసలిలంబు లొసఁగెద వేదవేద్య!
యాచమన మాచరింపు మనాదినిధన! ౯౪

శా. తాంబూలీనవపల్లవంబులకు ముక్తాచూరముం గూర్చి హై
మంబౌ పళ్లెరమం దమర్చి జనతామందార! పోక ల్లవం
గంబు ల్కస్తురి జాజి యేలకులు మే ల్కర్పమ్ము జాపత్రియున్
సంబాళించి యొసంగుదుం దముల మిచ్చం గైకొనంగాఁ దగున్. ౯౫

క. శ్రీదయిత! యాచమింపుము
వేదాన్తనితాన్తవినుతవిజ్ఞానఘన
శ్రీదీపాయిత! నాపై
నాదరమునఁ గప్పురంపుఁ టారతిఁ గొనుమా. ౯౬

గీ. అఖిలలోకైకనాథ! మహార్ఘ్యరత్న
ములును గోవులు వేయు నీ భూతధాత్రి
భూరిభూరియుతమ్ముగఁ బుచ్చికొనుము
మంత్రపుష్పమ్మునకుఁ గా సమర్పితములు. ౯౭

గీ. ఛత్ర మర్పింతు విసరెదఁ జామరముల
నశ్వహస్తిరథాందోళికాదు లైన

వాహనవిహారములఁ గూర్తు వాసుదేవ!
యవధరింపుము వేదశాస్త్రాధిగమము. ౫౮

గీ. అమరమునివంద్యమానభవ్యాంఘ్రిపద్మ!
మలసి యష్టాంగములతోఁ నమస్కరింతు
త్వద్దయావాప్తభావనాభ్యాసశక్తి
సూర్యచంద్రాగ్నిమయ! నిన్నుఁ జుట్టివత్తు. ౫౯

మ. శ్రుతి సెప్పె న్నిను నిట్లు కొల్వ మనుచున్ శ్రుత్యంతసంవేద్య! కూ
ర్చితి నా నేర్చినభంగి దీని ఫల మర్పింతు న్భవద్ధస్తసం
గత మాఁగావుత మాద్యపూరుష! వినంగా నైన విజ్ఞప్తి నా
నతితోఁ జేసెదఁ జిత్తగింప నవధానం బున్నదే? శ్రీహరీ! ౬౦

మ. పలుజన్మంబులఁ బాపపుంజముల సంపాదించుటే కాక యు
త్తల మయ్యెం జుమి యీ భవంబునను మత్ప్రారంభ మే నేడ? కాం
తల పన్నాగములోన చిక్కువడి సత్యం బంచు సంసారముం
దలపైఁ దాల్చి చరించుటేడ? యకృతార్థ మ్మయ్యె బోధ మ్మహో!

ఆ. మాయ వన్ని యొక్క మాయలాడి వొనర్చు
కార్యగౌరవమ్ము గానలేని
యట్టి కర్మ మనుభవార్హమే? యకట నీ
యట్టివాని నమ్మినట్టి నాకు.

శా. కన్నుల్లోవయెను గాంతలం గని చెవు ల్గండెం దదాలాపసం
ఛన్నత్వమ్మున దేహముం జెడెఁ దదాసంగప్రసంగానుష
క్తి న్నే నెట్లు తపం బొనర్పఁ దగుదున్? దేవేశ! యీ పుట్టునన్
జన్న న్వచ్చునె? యిట్టి జన్మ మెడలెన్ సౌఖ్యంపు సంకల్పముల్.

శా. రామం గన్గొని బొమ్మ యంటిని విహారం బన్న నిందించితిన్
గాముం గెల్చెదఁ గ్రోధుఁ డంటిని ముముక్షున్ బ్రహ్మచర్యాదిదీ
క్షామాంగల్యము పూని యింద్రియములన్ గారించి కారించి యా
రా? మోసంబున గోతిలోఁ బడితి నార్యా! మాటలిం కేటికిన్?

శా. శీలం బట్టిది కార్య మిట్టిది మదాస్తిక్యమ్మె చింతింపుమా
పాల న్ముంచిన నీట ముంచినను నీ పాలైతి రావయ్య! జా
గేలా? పాలితభక్తజాల! యనఘుండేని న్నినుం బిల్చి యీ
జాలిం జెందునె? నాదు యాచ్ఞ కెటులో? సాఫల్య మూహింపవే.

శా. ఇష్టం బైనది యింపుగాక గజరా జేనాఁటి చుట్టమ్ము? సం
దిష్టంబు ల్దలఁ దాల్చి తిర్గితివి కౌంతేయు ల్దార ల్నీకు? ని
ర్దుష్టుం డే సురనాథు నేలెదవు? కద్దో? లేదో? మోమోట మా
విష్టుల్ నా కవి యేల? వచ్చెదవె? రావే? దేవ! న న్గావఁగన్. ౭౭

మ. సకలశ్రీలను ధారవోసిన బలి న్బాధించి బంధింపవా?
యకలంకుం డని వైరి తమ్మునకు రాజ్యం బిచ్చి మన్నింపవా?
సుకృతు ల్నైజము లైనవారలకు నాకుల్ వైచి కానట్టివా
రికిఁ గంచమ్ములు వెట్టుటే నయమొ? శౌరీ! నా రుజ ల్బాపవే.

శా. ఈ యంగమ్ములు నింద్రియమ్ములు మనం బీ బుద్ధియు న్నీకు నీ
శా! యర్పించితిఁ గొన్న మానిన బలే సంతోసమే యయ్యెడున్
నీ యిష్టం బెటు లట్లు చేసి కొనుమీ నిర్మాయ! యీ మూఁక నే
నే యర్థంబులఁ గూర్పు, రాగదె, దయాబ్ధీ! స్వార్థసంరక్షకై. ౭౮

క. అని యూరకున్న మఱియొక
స్వనమున వినఁబడియె క్షేత్రపాలక! నీవే
మొనరించుచుంటి? హరి కీ
మునిచరితము దెల్పుకున్న మోసము రాదే? ౭౯

### ఇంకొక సంరంభవచశ్శ్రుతి

శా. రాధాలోలుఁ డెఱుంగడో? వినఁడో? సంత్రస్తాత్మ విజ్ఞప్తి సం
బాధంబుం బెడబాపు మంచుఁ జెపుమా మానాథుతోఁ గాని చో
నీ ధుర్యత్వ మపార్థమై చనఁగ నా నేర్పెప్పు నిమ్మూర్తి న
బ్బాధాత్మున్ గదియించి కూర్చెద లయంబు న్నేఁడ యన్పల్కులన్

మ. కలఁగెం దోయధు లుర్వి కంప మొనసెన్ క్ష్మాభృత్తు లుఱ్ఱూతలూఁ
గె లతాంగంబుల డాగె మారుతుఁడు దగ్గెం దేజ మామండలం
బులకుం బూరటిలె న్నభంబు నపు డా పూఁబోఁడి తా లేచి పో
యె లతాంతాయుధుఁ గన్నవానిదెస కెంతే భీతభీతాత్మ యై. ౨౧

## స్వామి సాక్షాత్కారము

సీ. మెఱుఁగుల వెదఁజల్లు మేలిమి బంగారు
జరిసేల్వ బుజమునఁ జాలువాఱ
ముకుటాంగదాదు లౌ భూషణమ్ముల గము
ల్గలచోట్ల బిగిదక్కి కదలియాడ
లలి సంభ్రమించు చూపు లొకండొకఁడ వేన
వే లయి దిక్కులఁ బిక్కటిల్లఁ
జూచి తొండాడి పచారెంచు నడ నడు
గడుగున శేషాహి కెడరు పుట్ట
లేచి కదలి విలోకించి త్రోచి పోవు
చున్న యన్నాథు దరిసి యా యన్నుమిన్న
చెన్ను మీఱఁగఁ గౌఁగిలించె దరినుండి
మున్ను వేఁడెడు ననఁబోఁడి విన్నఁబోవ. ౨౨

మ. కనఁ డా కామిని దాని స్పర్శమున సౌఖ్యంబు న్విమర్శింపఁ డా
మును ప్రార్థించు లతాంగితోఁ బలుకఁ డే ముఖ్యాత్మవర్గంబు ర
మ్మనఁ డప్డెయ్యది భైరవుం డనెడు తె ర్వాలింపఁ డీశుండు మీ
ఱిన సక్తి న్మను లిర్వు రున్నెడకుఁ బాఱెన్ ధీరతాదూరుఁ డై. ౨౩

గీ. వచ్చెఁ బిలువక యే పరివార మెల్ల
నల్లు దరిసిన పుండరీకర్షి వరదుఁ
గాంచి సాష్టాంగ మెరఁగె నొక్కండు మాని
యున్న మెయి నుండె నొదిగి వేరొక్కమాని. ౨౪

ఆ. ఒకని మొగము బుజుకు చొక్కని శిరమునఁ
జేయి మోపి విభుఁడు చిత్రమయ్యె
నింత కలితనమ్మె? యెంత సాహస మంచు
నొకని నిశ్చలతకు నులుకుచుండ. ౭౬

మ. మలభూనాథు ననుగ్రహించి తిటు శ్రీమంతుండ! యాలింపు మీ
యలఘుస్వాంతుఁడు సాధ్యసాధనము లాత్మాధీనము ల్సేసినాఁ
డల సె న్నీ దయసేయు కార్యమున కీ యాలస్య మి ట్లౌటఁ దాఁ
బలుకం డిప్పుడు దేవ! యింద్రియముల స్స్వత్వంబు లేకుండుటన్.

గీ. విన్నవించెద నిటు చూడు విశ్వనాథ!
వీరితో నేమి పని? యింక వెస విదేహ
కేవలత్వంబు భాసింపఁ గృతిఁ గృతార్థ
ముగ నొనర్పఁగదే నిజామోద మెసఁగ. ౭౭

క. అని పలుకు బాలమునిఁ గా
దని దేవుఁ డతండు పలికె నాదర మొప్పన్
మునివర! కాలాంతరమున
ననుగ్రహించితిన యట్టె యపవర్గంబున్. ౭౮

శా. జీవన్ముక్తుల రై చరింపుఁ డిపు డాస్తిక్యమ్ము పెంపార వి
ద్యావాప్తి న్దగు బోధసంతతికి సౌఖ్యం బందుచున్ క్షుత్తృడా
శావైక్లవ్యముఖావయోగచయము ల్శాంతింప దాంతిన్ నను
న్భావారాధు నొనర్పఁ డిచ్చితిని దివ్యత్వంబు మీ కియ్యెడన్. ౭౯

గీ. పంబికొను భక్తి నాత్మార్పణం బొనర్చి
నట్టి యీ యోగి బుద్ధీంద్రియాదు లెల్ల
నిచ్చ నిచ్చితి మరల లే దిందుఁ గొదువ
జానఫలము నొసంగితి ధన్యుఁ డయ్యె. ౮౦

క. అనుచుండ నధికృతుం డయి
యనియెం బ్రథమముని దేవ! య ట్లేటికి నెం

డి ననుం ద్రోచెదు సంసృతి
వననిధి నకటా! శ్రమంబుపడ లే ననుచుక్. ౮౧

ఉ. దానికి నిట్లను న్విభుఁ డుదారమనస్కుఁడ వీవు కాముసం
ధానమునందుఁ జిక్కఁచవె? తప్పని కర్మ మవశ్యభోగ్య మై
యీ నెరి భుక్తమయ్యె నిఁక నే యఘముల్ నశియింపఁబోవు ము
న్నా నవలాచరిత్రమున కైన నిమిత్తము నీ వెఱుంగవే? ౮౨

గీ. అనినఁ బ్రార్థించి యిట్లను న మ్మునిపతి
యీశ! యిప్పుడు కైవల్య మిడవ యేని
నిరువురము నిట్టు లుండుట హితమ యేని
నాదరమ్మున నొసఁగు మభ్యర్థితములు. ౮౩

శా. మాకుం బాయనిమైత్రి ముఖ్య మటు పై మానాథ! నీపై మనం
బేకారూఢము గావలె న్వినుము మే మెల్లున్నఁ గీడేమియుక్
లేకుండన్వలె నిష్ట మైనపుడ నీనిం జొచ్చెదంగాక స
ర్వాకారంబున మత్కథాశ్రవణ మాత్మామోదముం గూర్చుతన్.

గీ. అనిన నో మనేఁ బ్రభుఁడు రుక్మిణి నుత యయి
సుప్రసాదంబు బ్రజ్ఞకుఁ జొప్పడు ననేఁ
బతికి మెచ్చుగ నుత్తమగతియ యనియె
వాని కాంతఁ దలంచి రాధానతాంగి. ౮౫

క. ఆనందముతో నాథుం
డానెరిఁ గొనియాటతోడ నారుక్మిణి రా
ధానలినాక్షి హసన్ముఖి
యై నలిఁ బరివార మరిగి రంతర్హితు లై. ౮౬

సీ. సత్కర్మ మొనరించు జనులను వినుతింతు
రంతకం బెను దారు నాచరింతు
రల జాప్యము జపించు ననఘుల మెచ్చెద
రనిశంబు దారు జప్యము జపింతు

గుణగాయనములతోడఁ గూడి పాడుదు రెందు
భక్తి యిట్టిది యని పరు లెఱుంగ
నెద్దాన నంతర మెందుఁ జరించుచు
నెఱిఁగి జీవన్ముక్తు లిచ్చ మెచ్చ
అరయ నెదియు లోకానుగ్రహార్థ మిట్లు
గురుఁడు శిష్యుఁడు శిష్యుఁడు గురుఁడు నైన
న మ్మహాత్ములు సాంద్రబోధాత్ము లగుచుఁ
దృప్తిమెయిఁ బల్కుచుండు రదీనవృత్తి.

సీ. సాధ్యసాధనము లౌ సర్వాగమార్థంబు
లేకరసంబు లై యెఱుఁగఁబడియె
శక్యప్రకారసంసక్తిఁ జొప్పడు సర్వ
హోతలు నేకతాజ్ఞాతు లైరి
విస్పష్టమయ్యె నిర్విషయప్రదీప్త మౌ
సత్యచిదానందసంప్రసాద
మన్ని తేజమ్ములు నాత్మ తేజోఽనవ
చ్ఛిన్నమ్ము లనుట నిశ్చితము తోఁచె
నిన్న దినము లేని నెఱుఁగమి మాయావి
మోహమున భ్రమించి మోసపడుట
దాని లోప మెట్లు? తప్పు స్వీయము కాక
యుండ మాపులందు నీడు సెల్ల.

శా. శైలాగ్రమ్మున నున్నవాఁడు వసుధాసంస్థార్థజాతంబు ను
ద్వేలాబ్ధిం బడి యీఁదుజంతుతతిఁ దత్తీరంబునం దున్నవాఁ
డే లీలం బరికింతు ర ట్లగపడెన్ హృద్యాత్మసంబోధసా
ధాలంబోన్నతి నున్నచో జగ మవిద్యావీచికాలోల మై.

ఆ. అల్లిబిల్లి గాఁగ నల్లి యవిద్య మున్
జక్కనేసెఁ గర్మశాఖ లన్న

విఱిచి వానిఁ బాఱవేసితి స్థాణువ
నైతి నేమి సేయు నదియు నివియు? ౯౦
శా. జన్మాదు ల్లనుఁ జెంద వింక సకలాశాపాశము ల్వీడె సం
పన్మాంద్యంబు దొలంగెఁ గర్మతతి నిష్పన్నార్థ మై మాసె నే
తన్మాయాసతి సొంత యయ్యె నికఁ జిత్తం బెద్దా దీపించు వి
ద్వన్మాన్యస్థితి రత్నదీప మన నిష్ప్రత్యూహ నిర్వ్యాథ మై. ౯౧
శా. నా యజ్ఞానము వోయె నెక్కడనొ? ధన్యత్వంబు సేకూరె వి
ద్యాయోగ మ్మమరె న్సమస్తజగదంతర్యామి వై శాశ్వతం
బై యేకాత్మత మించు తత్త్వ మదె నే నానంద మి ట్లుండ వ
ద్దే? యంచుం బులకించుచుండి రల మౌనీంద్రు ల్ముదాపూర్ణులై.
క. ఆవాసుదేవ విబుధుం
డీ వడువున నొడువుచుండఁ గృష్ణాతీర
స్థావనిఁ జేరితి మది మది
భావించి కృతిన్ రచించి భవదర్పితముగన్. ౯౩
క. పొనరించితి నను నా కృతి
ననుకూలత నరయుమయ్య! యాత్మీయత్వం
బును వీడకుమయ్యా! నీ
పెన్ప్రాపున నిహపరము లవేలమ్ము లవున్. ౯౪
గీ. చెన్నకేశవదేవ! వాంఛితవితరణ
చణసమగ్రానుభావ! త్వచ్చరణకమల
మహిఁ సమర్పిత మైన యామూవికఁ గృతిఁ
బ్రచిత మయ్యె నెనిమిదవ ప్రకరణ మిది. ౯౫
గీ. తాడేపలి వేంకటప్పసత్కవితనుజుఁడ
సన్నుతచరిత్ర హనుమాంబ కన్నతల్లి
సన్ను రాఘవనారాయణ యని పిల్తు
రాలు శ్రీదేవి నినుఁ గొల్వ నమరితి మిటు. ౯౬

సమాప్తము.

# సవరణ

| పు | పం | త | ఒ |
|---|---|---|---|
| 2 | 4 | రములనె | రమె |
| 6 | 8 | వనిపా | వినిపా |
| 12 | 13 | సన్ని | సన్న |
| 14 | 2 | కండు | కొండు |
| 17 | 7 | భా | ధా |
| 19 | 18 | నొప్పం | వొప్పం |
| 22 | 17 | గియం | గియొదిగియం |
| ,, | 21 | దృతు | నృతు |
| 29 | 10 | లర్పిం | లర్చిం |
| 33 | 15 | డే | డె |
| 40 | 21 | విరి | విడి |
| 41 | 17 | బ్రచ్చి | బ్రబ్బి |
| 46 | 17 | కాంచె | కాంచెరాత్రి |
| 47 | 12 | ప్రచి | బ్రచి |
| ౫౪ | 18 | కోరి | గోరి |
| 58 | 24 | మయ్యి | మియ్యి |
| 62 | 8 | వాని | వాలి |
| ,, | 14 | సఱ | జఱ |
| 63 | 13 | పర | సర |
| ,, | 20 | లుచూచి | లజూచి |
| 66 | 20 | మోల | మ్రోల |
| 68 | 20 | నాగిం | నాగి |
| 69 | 14 | నెడ | వెడ |
| ,, | 17 | దింత | దింక |
| 70 | 12 | ధుర | ధుకర |
| ,, | 18 | పీడా | పీఠా |
| 72 | 17 | పన్ని | పన్ని |
| 73 | 1 | వెటి | వెఱి |
| ,, | 14 | బంచి | బం |
| 76 | 22 | నేయి | నాల |
| 80 | 4 | జన్మ | జన్మి |
| ,, | 18 | ను | న్ను |
| 92 | 9 | మీఱు | మీ |
| ,, | 19 | మోమి | మో |
| 84 | 4 | రుడు | రెడు |
| ,, | 11 | వాని | వాలి |
| 85 | 8 | రూఢి | రూఢ |
| 92 | 8 | జర్యా | రాజ |
| 93 | 5 | మెల | మెన |
| ,, | 11 | లుతా | విలా |
| 97 | 22 | దుచుక్ | దుచో |
| 98 | 21 | భూమి | భామి |
| 99 | 5 | ముక్ | ముల్ |
| 104 | 4 | మురు | ముఱ |
| 105 | 4 | పేర్చి | సేర్చి |
| 106 | 19 | పంచి | పంబి |
| 119 | 17 | ద్ధామ | ద్ధామః |
| 121 | 6 | యఃల్పు | యజ్జు |
| 126 | 7 | ద్ధాని | ద్ధాన |
| 132 | 7 | లువ | లుప |
| 133 | 14 | నేను | నేమ |
| 139 | 16 | గాను | గాన్చు |
| 142 | 16 | గూర్పు | గూర్చ |